





# కథలు

## నీతి, పురాణ, పొడుపు

# టాల్ స్టాయి కథలు





# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000004327



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

Author's Last Name

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# టాల్‌స్టాయి కథలు

## రెండవ భాగము

కర్త: టాల్‌స్టాయి

అనువాదకర్త: భమిడిపాటి కామేశ్వరరావు

పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# విషయసూచిక





# కౌంట్ లియొ టాల్‌స్టాయ్

**(1828 - 1910)**

టాల్‌స్టాయ్ రష్యాదేశపు ఇటీవలి సారస్వత చరిత్రలో అత్యున్నతమైన ప్రత్యేక స్థానం ఆర్జించుగున్న మహావ్యక్తి. ఆయన జమీందారీ కుటుంబంలో జనించినవాడైనా, సాధారణ యోధుడుగ సేనలో జేరి రణరంగానికి వెళ్లి, సైనికుల యిక్కట్లు స్వానుభవంవల్ల తెలుసుకున్నాడు. ప్రజలయందు ఆయనకు గల సానుభూతి, సత్యధర్మాలయందు ఆయనకు గల ఆసక్తి ఆయన్ని కలం పట్టించాయి. భౌతికమైన భోగాలకీ అధ్యాత్మికమైన ఆశయాలకీ ఆయన హృదయం నిరంతర సంగ్రామ రంగం అయింది. ఆయన యోచన విప్లవానుగుణం అయినా, ఆయన శక్తి పరిణామవాదపక్షమే. తలపెట్టిన ఉద్యమంలో త్రికరణంగా లీనం అయిపోవడం ఆయన స్వభావం. సకల విధ స్వాతంత్ర్యం ఆయన లక్ష్యం. భూధనధాన్యాదుల అపరిమిత సేకరణకి ఆయన ద్వేషి. తన నైతిక లక్ష్యాన్ని చేరుకోగల మార్గాన్ని తన జీవితం నడుపుకోలేకపోతిని గదా అని చివరదాకా ఆయన బాధపడ్డాడు. తన యావదాస్తి వదిలేసి తను వానప్రస్థంలో ఉంటూ ఆయన కర్షక జనానికి తోడ్పడ్డాడు. పైపై జ్ఞానం ఆర్జించి విద్యాధికులం అనుకునేవారి సంకుచితత్వం ఆయన హేళనచేశాడు. ఆయన ప్రజ్ఞ సర్వతోముఖం. ఆయన ఎక్కడ చెయివేస్తే అక్కడ చైతన్యం ఉట్టిపడింది. ఆయన సృష్టి అపారం - నవలలు, నాటకాలు, కథలు, చరిత్రలు, విమర్శనలు - అన్నీ చరితార్థం అయినవే. ఆయన శైలి హృదయంగమం.

ఈ సంపుటంలో 23 కథ లున్నాయి. జీవిత సమస్యలలో ఏదో ఒకటి గొప్పది చర్చింపబడని కథ ఏదీ లేదు. ఈ ఇరవైమూడు కథల్నీ నేను పరిమాణ ప్రకారం క్రమపరిచాను. 'ఈ ఇరవైమూడు కథలు మాత్రమే రచించి ఉండీ మరి యితరత్రా యే రచనా టాల్‌స్టాయ్ చేసుండకపోయినా, ఆయన రచనా ప్రసిద్ధి ఇప్పటిలాగే ఉండేది', అని ఒక మహావ్యక్తి చేసిన విమర్శ జ్ఞప్తియం దుంచుగుంటే, ఇవి ఎటువంటి మహిమ గలవో బోధపడుతుంది. ఇందులో ఒక్కొక్కటి, వ్యాసమూ, కథా, కథానికా, సామ్యకథా, చరిత్రా, ఆత్మకథా, లేక అన్నింటి సమ్మేళనానా అనిపిస్తుంది.

వీటి ఆంధ్రభాషాంతరీకరణం గురించిన అనుమతికోసం ఢిల్లీలోని 'రష్యన్ ఎంబెసీ' వారిని నేను కోరగానే, వారు అనుమతి ఇచ్చారు. వారికి కృతజ్ఞుణ్ణి.

అనువాదకర్త.

# టాల్‌స్టాయి కథలు

## దేవుడు సత్యం గమనిస్తాడు, కాని నిదానిస్తాడు

వ్లాదిమియరు అనే నగరంలో ఇవాన్ అక్షినోవ్ అనే వర్తక యువకుడు ఉండేవాడు. అతనికి స్వంత గృహమూ రెండు షాపులూ ఉండేవి. అతడు రూపసి, అందమైన ఉంగరాల జుట్టు వాడు. వినోదప్రియుడు. గానం అంటే చెవికోసుకునేవాడు. అతడు యవ్వనం రాగానే తాగుడులోపడి, అది మిక్కుటం అవుతోచ్చినప్పుడు గత్తరచేస్తూండేవాడు. కాని, వివాహం కాగానే అతడు తాగుడు మానుకున్నాడు—అప్పు డప్పుడు తప్ప. ఒక వేసవిలో ఆతడు ఒకనాడు నిజ్నీ అనే నగరం సంతకి బయల్దేర బోతూ, వెళ్ళొస్తానని భార్యతో అనగా, ఆమె, "స్వామీ! ఈవేళ బయల్దేరకండి. మీమీద నాకు పీడకలవచ్చింది." అంది. అక్షినోవ్ నవ్వుతూ, "సంతఊరు చేరుకోగానే నేను తప్పతాగేస్తా నని నీ భయంగావును." అన్నాడు. అందుకు భార్య, "దేన్ని గురించి నా భయమో నే నెరగనుగాని, నాకు చెడ్డకల రావడం మట్టుకు నే నెరుగుదును. కలలో, మీరు తిరిగి యింటికి వచ్చారట, టోపీ తీశారట, తలంతా నెరిసిపోయిందిట!" అంది. అక్షినోవ్ మళ్ళీ నవ్వి, "అది చాలా శుభసూచకం! చూస్తూ ఉండూ, నిమిషంలో నేను సరుకులు అమ్మేసి, నీకు బహుమతులు పట్టుకొస్తానో లేదో!" అనేసి, ఆమెనీ పిల్లల్నీ ముద్దెట్టుకుని, బండి యెక్కి వెళ్ళిపోయాడు.

సగం లెక్క వెళ్ళింతరవాత, తనెరుగున్న మరో వర్తకుణ్ణి అతడు కలిశాడు. రాత్రి పడగా, వాళ్ళిద్దరూ ఒకే హోటల్లో బసచేశారు. వాళ్లు కలిసే టీ తాగి, పక్కగదుల్లోనే పడుకున్నారు. ఆలస్యంగా లేవడం అక్షిణోకి అలవాటు లేదు. చల్లపొద్దున్న ప్రయాణం చెయ్యడం నయం అనుకుని, అతడు తన బండివాణ్ణి తెల్లారకట్టే లేవగొట్టి గుర్రాల్ని పూన్పించి, హోటలు భవనాన్ని వెనకవేపు పెరటింట్లో ఉంటూండే యజమానిని కలుసుగుని, తన గ్రాసవాసాల బిల్లు మొత్తం చెల్లించేసి, ప్రయాణం సాగించాడు.

ఒక పాతికమైళ్ళు వెళ్ళినమీదట గుర్రాల దాణా నిమిత్తం అతడు ఆగి, ఒక హోటలు నడవలో తను దిగి, ముందువాకిట్లోకి వచ్చి, టీ కాచుగునే టందుకు ఉడుకునీళ్ళ కుంపటి ముట్టించండని చెప్పి, తన బిదారు పైకి తీసి వాయించుగుంటూ కూచున్నాడు.

ii

అంతట్లో గంటల గణగణతో ఒక మూడు గుర్రాలబండి వస్తూ అక్కడ ఆగింది. ఒక పోలీసు ఉద్యోగి అందులోంచి దిగాడు. వెనకాలే యిద్దరు సిపాయీలు దిగారు. ఆ ఉద్యోగి తను దిగింది మొదలుచేసుగుని అక్షిణోని తెగప్రశ్నలు.— నువ్వు ఎవరవ్? ఎక్కణ్ణించి వచ్చావ్? అంటూను. అక్షిణో ఆ ప్రశ్నల కన్నింటికీ పూర్తిగా సమాధానం చెప్పి, 'కొంచెం టీ పుచ్చుగుంటారా?' అని ఉద్యోగిని కోరాడు. కాని, ఆ ఉద్యోగి అక్షిణో మీద విషమ ప్రశ్నలు కురిపించడం తప్ప మరోటి లేదు.—నిన్న రాత్రి ఎక్కడున్నావు? ఒక్కడివే ఉన్నావా లేక ఆ తోటివర్తకుడితో కలిసా? ఉదయాన్ని ఆ తోటి వర్తకుణ్ణి

చూశావా? తెల్లారకట్టే నువ్వు హోటల్నించి ఉడాయించి వచ్చేశావేం?— మొదలైనవి. ఈ ప్రశ్నలన్నీ తనని అతడు ఎందుకు అడుగుతున్నాడో తెలియక అక్షినోవ్ ఆశ్చర్యపడ్డాడు. జరిగింది యావత్తూ అతడు యథార్థంగా చెప్పేశాడు. చెప్పేసి, ఆ ఉద్యోగితో, 'ఎవణ్ణో తస్కరుణ్ణీ దోపిడీవాణ్ణీ అడిగినట్టు విషమ ప్రశ్నలు నన్ను అడుగుతున్నారే! నా స్వంతపనిమీద నేను పోతున్నాను. నన్ను మీ రిల్లా ప్రశ్నించవలసిన అవసరం ఏమీ కనపడదు,' అన్నాడు. అప్పుడు ఉద్యోగి సిపాయీలని హాజరు పెడుతూ, 'నేను ఈ జిల్లా పోలీసు అధికారిని. ఇన్ని ప్రశ్నలు నిన్ను నేనడగడానికి కారణం లేకపోలేదు. నిన్నరాత్రి ఆ హోటల్లో కలిసి ఉన్నావే ఒక వర్తకుడితో, ఆ వర్తకుడు తన గదిలో శిరస్సూ మొండెమూ వేరై ఉన్నాడు, పొద్దుటికి. నీమూటలన్నీ మేం సోదా చెయ్యాలి,' అన్నాడు.

తక్షణం ఆ సిపాయీలూ పోలీసు అధికారీ లోపల ప్రవేశించి, అక్షినోవ్ తాలూకు సామాను మూటలన్నీ విప్పేసి వెతగడం ప్రారంభించారు. చటుక్కున ఆ ఉద్యోగి అక్షినోవ్ సంచీలలో ఒక దాల్లోంచి ఒక కత్తి పైకి లాగుతూ 'ఈ కత్తి ఎవరిది?' అని అడిగాడు. అక్షినోవ్ చూశాడు, రక్తసిక్తమైన ఓ కత్తి తన సంచీలోంచి తీయబడడం గమనించాడు, హడిలిపోయాడు. ఆ ఉద్యోగి, 'ఈ కత్తిమీదికి నెత్తురు ఎట్లావచ్చిందీ?' అని అడిగాడు. సమాధానం చెప్పడానికి అక్షినోవ్ యత్నించాడు గాని, నోటంట ఒక్క ముక్కైనా రాలేదు. చివరకి ఏదో నట్టుతూ, 'నే....ఎరగను....,నాదికాదు,' అన్నాడు. ఆ ఉద్యోగి, 'పొద్దుట

చూసేసరికి నీ సాటి వర్తకుడు అతని పక్కమీద కత్తిదెబ్బతో తల వేరు చేయబడి ఉన్నాడు. ఆ హత్య, నువ్వు తప్ప ఇతరులు చేసుండడానికి వీలేలేదు. తలుపులు లోపల్నించి వేసున్నాయి, మరెవరూ అక్కడ లేరాయె. రక్తసిక్తమైన కత్తీ ఇదుగో నీ సంచీలో ఉండగా మేం చూసి తీశాం. నీ మొహమూ నీ వాలకమూ నీ గుట్టు బయట పెడుతున్నాయి. ఇక ఉన్నసంగతి కక్కేసెయ్. అతణ్ణి ఎల్లా చంపావు? ఏ మాత్రం సొమ్ము కొట్టేశావు?' అన్నాడు. అక్షినోవ్. 'అయ్యా, ప్రమాణంచేసి చెబుతున్నాను, నేను ఏ హత్యా చెయ్యలేదు. టీ తాగుతూన్నప్పుడే తప్ప, తరవాత, ఆ వర్తకుణ్ణి నేను చూడనేలేదు. నా కూడా నేను తెచ్చుగున్న ఎనిమిదివేలూ తప్ప ఇతరం నా దగ్గిర ఏ సొమ్మూ లేదు. ఈ కత్తి నాదికాదు,' అని విన్నవించాడు. కాని, మాట చెప్పేటప్పుడు అతడు మధ్య మధ్య గుటకలు వెయ్యడం, అతని మొహం పాలిపోవడం, అతడు భయంతో వణకడం చూస్తే ఇతడు నేరం చేశాడు గావును అన్నట్టున్నాయి. అక్షినోవ్‌ని బంధించి బండిలో పారెయ్యవలిసిందిగా అధికారి సిపాయీలకి ఆజ్ఞ యిచ్చాడు. వాళ్లు తనకాళ్లు కట్టి బండిలో తనని గిరవాటేసేటప్పుడు అతడు దేవుణ్ణి తల్చుగుని దుఃఖించాడు. అతడి సొమ్మూ వస్తువులూ లాగేసుకుని, అక్కడికి దగ్గిరలోఉన్న పట్టణానికి అతణ్ణి పంపించి ఖైదు చేశారు.

iii

వ్లాదిమియరులో అతడి గుణ శీలాల గురించి పైవారు దర్యాప్తు చేశారు. వెనకటి రోజుల్లో తప్పతాగి కొంతవరకు

పాడైనా, అప్పట్లో అతడు మంచివాడే అని వర్తకులూ తక్కిన గ్రామవాసులూ అన్నారు. మెల్లిగా కేసు విచారణకి వచ్చింది. లియజాన్ అనే చోట్నించి వస్తూన్న ఒక వర్తకుణ్ణి అతడు చంపి అతని సొమ్ము ఇరవై వేలు తస్కరించాడనే నేరం అతని మీద మోపారు.

అతని భార్య నిరాశలో పడిపోయింది. ఎటు నమ్మడానికీ ఆవిడకి పాలుపోలేదు. పిల్లలుచూడొస్తే ఇంతింతా ఇంతింతానూ. కడసారి బిడ్డ చంటిగుడ్డు. వాళ్ళందర్నీ వెంటబెట్టుకుని ఆమె తన భర్తని ఖైదుచేసిన ఊరెళ్ళింది. ఆవిడ అతణ్ణి చూడడానికి మొదట్లో అనుమతి దొరకనేలేదు. కాని, ఎంతో కాళ్ళా వేళ్ళా పడ్డ తరవాత, అధికారులు అనుమతి ఇయ్యగా, ఆవిణ్ణి అతడి దగ్గిరికి తీసికెళ్ళారు. ఆ జైలు వేషంలోనూ సంకెళ్ళలోనూ చోరులు మొదలైన ఆ నేరగాళ్ళ మధ్య తన భర్తని చూడగానే ఆవిడ పడిపోయి ఎంతో సేపటికిగాని స్పృహలోకి రాలేదు. తరవాత ఆవిడ తన పిల్లల్ని చేరదీసుగుని, అతని దగ్గిరకూచుని, ఇంటిగోష వినిపించి, ఆయన చరిత్ర వినగోరింది. యావత్తూ అతడు వినిపించాడు. ఆమె, 'ఇప్పుడు మనం చెయ్యగలిగింది ఏమిటి?' అంది. అక్షీణోవ్. 'ఒక అమాయికుడు నాశనం అయిపోకుండా అడ్డుపడ వలిసిందిగా చక్రవర్తికి లిఖిత పూర్వకంగా విన్నపం పంపించుగోవాలి,' అన్నాడు. ఆమె, 'నేను ఒక విన్నపం పంపించాను. అది వారు స్వీకరించనే లేదు,' అంది. అక్షీణోవ్ మరి ఏ సమాధానమూ చెప్పకుండా నేలకేసి చూస్తూ ఉండిపోయాడు. ఆమె, "మీకు తల నెరిసినట్టు కల ఊరికే

వచ్చిందా నాకూ! మీకు జ్ఞాపకం ఉందా? ఆ రోజు మీరు బయల్లేరుండకూడదు అసలు,' అని, తన చేతివేళ్లు అతని జుట్టులో పోనిస్తూ, 'ప్రాణప్రియా, నేను మీ అర్ధాంగిని. నిజం చెప్పండి. ఆ హత్య మీరు చెయ్యలేదా?' అని అడిగింది. అక్షినోవ్, 'అయితే, చివరకి నువ్వుకూడా నన్ను శంకిస్తున్నా వన్నమాట,' అంటూ తన మొహం చేతుల్లో దాచుగుని గొల్లున ఏడ్చాడు. అప్పుడు ఒక సిపాయి వచ్చి ఆవిడా పిల్లలూ ఇక వెళ్లిపోవలిసిన వేళ అయిందన్నాడు. అక్షినోవ్ తన కుటుంబానికి ఆఖరి వీడ్కోలు చెప్పేశాడు. వాళ్లు అక్కణ్ణించి వెళ్ళిపోయిన తర వాత, గతం స్మరించుగోడంలో తన భార్యకూడా తనని అనుమా నించడం అతడికి జ్ఞాపకం రాగా, అతడు మనసులో, 'దేవుడికి తప్ప సత్యం తెలుసుగోడం శక్యంకాదు. ఆయనతోటే నేను మొరపెట్టుగోవాలి. ఆయన కనికరంమీదే నేను ఆశ పెట్టుగో వాలి,' అనుకున్నాడు. అనుకుని, ఎవరికీ ఏ విన్నపమూ పంప లేదు, ఆశ ఏ లేశమూ మిగుల్చుకోలేదు, దేవుణ్ణి ప్రార్థించడం తప్ప మరోటి చెయ్యలేదు. కొరడా దెబ్బలూ గనుల్లో చాకిరీ అతనికి విధించబడ్డ శిక్ష అని చెప్పారు. తోలుపట్టా కొరడాతో అతణ్ని ఉతికి, పుళ్ళు నయంఅవడం చూసుగుని, ఇతర శిక్షి తుల్తో పాటు అతణ్ని దేశాంతరం పంపేశారు, సైబీరియా దేశానికి.

## iv

ఇరవై ఆరేళ్ళు సైబీరియాలో అక్షినోవ్ శిక్షితుడై ఉండి పోయాడు. జుట్టు మంచులా తెల్లపడగా, గడ్డం పొడుగై పల్చ

బడి బూడిదరంగు చూపింది. అతని కులాసా ఎగిరిపోయింది. అతనికి గూనుకుడా తయారైంది. అతడు నెమ్మదిగా అడుగులు వెయ్యడం, సంభాషణ మానుకోడం, నవ్వు మరిచిపోడంలోనూ పడిపోయాడుగాని, నిరంతరమూ ప్రార్థనచేసేవాడు. చెరసాలలో అతడు చెప్పులు కుట్టడం నేర్చుగుని కుట్టి కొంతసొమ్ము ఆర్జించి, అదెట్టి 'మహాఋషుల జీవితాలు' అనే పుస్తకం కొని అది రోజూ చీకటి పడేవరకూ చదువుకునేవాడు. ఆదివారాలు చెరసాలలోని దైవమందిరంలో సువార్త పఠించి బృందగానం చేసేవాడు. అతడి కంఠం ఇంకా ఇంపుగానేఉంది. కారాగృహాధికారులకి అతని వినయం నచ్చింది. తోటిఖైదీలు అతణ్ణి గౌరవించేవారు. వాళ్ళు 'తాతా,' 'ఋషీ,' అంటూ అతణ్ణి సంబోధించేవారు. పైఅధికారుల్తో ఏదేనా విన్నవించుగోవాలంటే, వాళ్ళు ఆయన ద్వారానే వ్యవహరించేవారు. తమలో తమరికి తగాదాలు వచ్చి నప్పుడు కుడా వాటిని పరిష్కరించి న్యాయం తీర్చడానికి అయన్నే కోరేవారు. అతనికి తన యింటిసంగతి అతీగతీ తెలియ లేదు, భార్యా బిడ్డలూ ఇంకా జీవించిఉన్నారోలేక చచ్చిపోయారో కుడా అతనికి తెలియదు.

ఒకనాడు చెరసాలకి శిక్షితుల కొత్తముఠా వచ్చింది. సాయంత్రం పడగానే పాతఖైదీలు కొత్తఖైదీలు చుట్టూచేరి, వాళ్ళు ఏయే ఊళ్ళవాళ్ళో వాళ్ళని శిక్ష ఎందు కెందుకు పడ్డాయో కనుక్కోడం మొదలెట్టారు. అందరితోపాటు అక్షినో కుడా కొత్తవాళ్ళదగ్గిర కూచుని, దృష్టి దింపే ఉంచి, వాళ్ళమాటలు ఆలకించాడు. ఆ కొత్తశిక్షితుల్లో ఒకడు, మంచి పొడుగ్గా బలంగాఉన్న అరవై

యేళ్ళవాడు, బూడిదరంగు అంటకత్తిరి గడ్డంవాడు, తనని ఎందుకు నిర్బంధించారో చెబుతున్నాడు. వాడు, 'ఏముంది, స్నేహితులారా! ఒక మంచుబండికి గుర్రం పూన్చిఉంది. ఆ గుర్రాన్ని నేను పసుండి తీసుగున్నాను. ఆ మట్టున నామీద తస్కరణ నేరం మోపారు. ఇంటికి త్వరితంగా వెళ్ళవలిసుండి ఆ గుర్రాన్ని నేను ఒఖ్ఖసారి పుచ్చుగుని మళ్ళీ వదిలేశానర్రా. పైగా ఆ యజమాని నాకు ఆంతర్య స్నేహితుడర్రా, హెచ్చు తగ్గు ఏమీలేదర్రా, అని స్పష్టంగా వాళ్ళతో చెప్పి చూశాను. ఎన్ని చెబితేంగనక, నువ్వు ఆ గుర్రాన్ని 'తస్కరించావు' అంటారే వాళ్లూ! ఆ అన్నవాళ్లు, ఎక్కడ 'తస్కరించానో' ఎట్లా 'తస్కరించానో' చెప్పండం'టే చెప్పలేకపోయారు మళ్లాను! పూర్వం ఒకసారి నేను నిజంగానే చేశాను కొంతనేరం—చెప్పద్దూ! న్యాయప్రకారం అప్పుడే దయచెయ్యవలిసింది నే నిక్కడికి. అయితేం ఆ నేరంగురించి నన్ను వాళ్లు పట్టుగోనే లేకపోయారు. కాని, ఇప్పుడు నేను చేసింది నేరమేకాదు. అయినా ఇక్కడికి పంపించారు. నే నిక్కడికి రావడం విషయంలో చిన్న అబద్ధం ఒక టిప్పుడు చెప్పానులెండి, మరేమీ అనుకోకండి. లోగడ ఒకసారి నేనూ ఇక్కడికి వచ్చినవాణ్ణే, ఆట్టేరోజు లుండక పోయినా!' అన్నాడు. శిక్షితుల్లో ఒకగు, 'నీ రాక ఎక్కణ్ణించి?' అని అడిగాడు. అతడు, 'వ్లాదిమియరునించి. మావూరదే. నాపేరు మకారు. సమీనకే అనికుడా అంటారు నన్ను,' అన్నాడు. అక్షిణో తలయెత్తి, 'చెప్పు చెప్పు, సమీనకే! వ్లాదిమియరులో అక్షిణో వర్తకుల సంగతి నీకేమన్నా తెలుసా? వాళ్ళెవళ్ళైనా

ఇంకా బతికున్నారా ?' అని ప్రశ్నించాడు. అతడు, 'వాళ్ళ సంగతి తెలుసా అనా అన్నారు! తెలియకుండా కుడా ఎల్లా ఉంటుందీ ? అక్షియోనో కుటుంబం ధనికం. కాని, వాళ్ళ నాన్న మాత్రం ఇక్కడే దేశాంతరంలో ఉన్నాడట. మనికిమల్లేనే దుష్టుడుట. సరేగాని, తాతయ్యా, మీ రెల్లావచ్చారు ఈ స్థలానికి ?' అని ఎదురడిగాడు. తన దౌర్భాగ్యంగురించి చెప్పడానికి అక్షియోనో ఇష్టపడక, ఒక నిట్టూర్పుమాత్రం పుచ్చి, 'నా పాపాల మూలంగా ఈ ఇరవై ఆరేళ్ళనించీ నేను ఖైదులోఉన్నాను' అన్నాడు. 'ఏమిటాపాపాలు ?' అని మకారుసమీనకే కనుకున్నాడు. అక్షియోనో అట్టేచెప్పక, 'ఎవో ఎవో, నాకు తగ్గశాస్తే నాకు అయుంటుంది,' అనేశాడు. మరి ఎక్కువ అతడు అడిగినా చెప్పిఉండకపోను, కాని పాతవాళ్ళల్లో ఒకడు, 'ఒక వర్తకుణ్ణి కత్తితో పొడిచి, ఆ నెత్తురుకత్తి ఈయనగారి సామాన్లలో ఎవడో పెట్టేశాడు. ఈయన్ని అన్యాయంగా శిక్షించారు,' అన్నాడు. మకారుసమీనకే ఈసంగతి వినగానే అక్షియోనోని నిదానించి చూసి, తనమోకాలు చరుచుగుంటూ, 'అరె అరె! అద్భుతం! నిజంగా అద్భుతం! కాని ఎంతముసిలాడ వయావు, తాతయ్యా!' అన్నాడు. 'అల్లా ఆశ్చర్యపడతారేం ? లోగడ వారిని మీరు ఎక్కడేనా చూశారా యేం ?' అని కొందరు ప్రశ్నించారుగాని, మకారు జవాబు చెప్పలేదు. 'మేం ఇక్కడ సమావేశపడడం చాలా అద్భుతమండీ !' అని మాత్రం అన్నాడు. వర్తకుడి హత్యచేసినవాణ్ణి ఇతనెరుగునాయేమిటి చెప్మా అనుకుంటూ అక్షియోనో నిర్ఘాంతపోయేలాగ ఉన్నాయి ఆమాటలు. అందుకని, అతడు, 'సమీనకే! బహుశా,

ఆ వృత్తాంతం మీరు వినుంటారు, లేక లోగడ నన్ను చూసే ఉన్నారో!' అన్నాడు. అందుకు మకారు, 'వినక ఏంచెయ్యనూ! ప్రపంచంనిండా వదంతులే! కాని, ఎంతకాలం అయిందో ఏమిటో! అప్పుడు ఏం విన్నానో ఏం జ్ఞాపకం?' అన్నాడు. 'ఆ వర్తక హంతకుణ్ణి గురించి వినున్నారేమో, బహుశా!' అంటూ అక్షిణో అతణ్ణి శోధించాడు. అందుకు మకారు, 'ఎవడి సంచిలో కత్తిఉందో వాడే అయుండితీరాలి హంతకుడు. ఏదేవ దేనావచ్చి, తన కత్తి అక్కడ పెట్టేశాడా అంటే,—శాస్త్రం చెబుతారే, దొరికిందాకా దొంగాడే కాడూ! కాని, మీ తలకింద మీ సంచీ ఉంటూఉన్న సమయంలో మీ సంచీలో కత్తి అన్యు డొచ్చి ఎట్లా పెట్టగలడూ? అట్లా జరిగుంటే మీకు రూఢిగా మెళుకువ వచ్చుండేదిగదా!' అన్నాడు. వర్తక హంతకుడు వీడే అని, ఈమాటలతో, అక్షిణోకి రూఢి అనిపించింది. అతను లేచి వెళ్ళిపోయాడు.

V

ఆ రాత్రి రాత్రంతా అతడికి కంటిమీద కునుకులేదు. అతను తీవ్రమైన బాధ అనుభవించాడు. అతని మనస్సులో రకరకాల చిత్రాలు గోచరించాయి. అతని భార్య—శను సంతకి వెళ్ళే టప్పుడు తనకి వీడ్కోలిస్తూన్న రూపానికి ప్రతి—అక్కడ ఉన్నట్టే అనిపించింది అతనికి. ఆమె మాటలూ నవ్వులూ స్ఫుత మైనట్టైంది. తరవాత, పిల్లలు, పసిపాపలుగా అప్పట్లో ఉన్న రీతిగా, ఒకడు చిన్నచొక్కా తొడుక్కునీ మరోడు పాలుతాగు తూన్నూ కనిపించారు. అప్పుడు యవ్వనంలో హుషారుగా తనెల్లా

ఉండేవాడో కూడా అతనికి జ్ఞాపకం వచ్చింది. ఆ హోటల్ ఎదటి వాకిట్లో తను చిత్రాలు వాయిస్తూ కూచున్నప్పుడు తను నిర్బంధించబడడం, అంతవరకూ బాదరబందీ ఏమీలేకుండా నిశ్చింతగా తనుండడం, తనని కొరడాతో బాదిన స్థలం, అక్కడి హంతకాడూ, చుట్టూ మూగిన జనమూ, సంకెళ్ళూ, శిక్షితులూ, ఇరవై ఆరేళ్ళ తన చెరా, ఇంకా వేళకాకుండానే చేరబడ్డ తన ముసిలితనమూ— ఇవన్నీ తన మనస్సులో అతడు చూశాడు. ఆ ఆలోచనలో పడి, తనకి పరమ దైన్యం ఆరోపించుగుని, అతడు ఆత్మహత్య చేసుగోడమే నయమా అనిపించేమనస్థితికి వచ్చాడు. ఇదంతా ఈ పరమద్రోహిచేసిన పనే అని అక్షియోనో అనుకున్నాడు. మకారు సమీనకే మీద అతనికి కోపం అధికంగా, తన ప్రాణం ఎగిరిపోయినా సరేకాని, వాడిమీద కసితీర్చుగు తీరాలని అతడు తపించిపోయాడు. రాత్రెళ్లు పొడూగునా దైవప్రార్థన జరిపినా, అతనికి మనశ్శాంతి చేకూరలేదు. పగటివేళల మకారు సమీనకే వేపు నడిచేవాడు కాడు, అసలు అటుచూసేవాడుకుడా కాడు. ఇల్లా ఓ పక్షం గడిచింది. అక్షియోనోకి రాత్రెళ్ళు నిద్రలేదు, సరిగదా, ఆతడు ఏం జెయ్యాలో తెలియని దౌర్భాగ్యుడయాడు.

## vi

ఒకనాడు అతడు చెరసాలలో రాత్రివేళ తిరుగుతూ, ఖైదీలు పడుకునే అంతస్థుగదుల్లో ఒక గదికిందినించి మట్టి దొర్లడం గమనించాడు. అదేమిటూ అని ఆగిపోయాడు. ఆ గది కింది నించి మకారు సమీనకే పైకి పాకి వచ్చి, అక్షియోని చూసి హడిలిపోయాడు. అక్షియోనో వాణ్ణి చూడనట్టా పోదాం అనుకున్నాడు,

కాని, మకారు అతణ్ణి చెయ్యిపట్టుగుని ఆపి, 'నేను గోడకింద కన్నం తవ్వుతున్నాను. ఆ మట్టి బయట పారపోస్తున్నాను. రోజూ పని చెయించడానికి, ఖైదీలని బయటికి తీసుగు వెళ్ళేటప్పుడు నా పెద్ద బూట్సులో ఆమట్టి ఏరోజుదారోజు తరలించేస్తున్నాను. నువ్వు ఈ విషయం పొక్కనియ్యకు, ముసిలెయ్యా, నాతోపాటు నువ్వూ తప్పించుగు పారిపోవచ్చు, నువ్వుగాని నోరు జారావా, వాళ్ళు నన్ను ప్రాణావశిష్టంగా బాదేస్తారు. కాని, ఆలోపలే నిన్ను చంపేస్తాను.' అన్నాడు. ఆ శత్రువుని చూసి అక్షినోవ్ కోపంతో వణికిపోయాడు. మకారు చెయ్యి విదిలించుగుంటూ అక్షినోవ్, 'నాకు తప్పించుగు పారిపోవాలని లేదు. నన్ను నువ్వు చంపవలిసిన అవసరం లేదు. పూర్వమే చంపేశావుగదా! ఇక, నీ కన్నపురహస్యం నేను బయట పెట్టడం గురించి అంటావా, అది నేను బయట పెట్టవచ్చు, మానవచ్చు, దేవుడు నన్ను ఎల్లా తిప్పితే అల్లాచేస్తాను' అని చెప్పేశాడు.

మర్నాడు, శిక్షితుల్ని పన్లకి తోలుకు వెళ్ళే కాపలాభటులు, ఖైదీలలో ఎవరో ఒకరు మట్టి అవతల పోస్తున్నారన్న సంగతి గమనించారు. వాళ్ళు చెరసాలగదులు గాలించారు, కన్నం పోల్చుగున్నారు. గవర్నరు వచ్చి కన్నం తవ్వినవా డెవడో తెలుసునా అని ఖైదీలందర్నీ ప్రశ్నించాడు. ఎవడిమట్టుకి వాడు తనకి తెలియదు పొమ్మన్నాడు. తెలిసినవాళ్ళుకుడా, మకార్ని కొరడాతో చావబాదేస్తారేమో అని, అతడిపేరు బయట పెట్టలేదు. చిట్టచివరికి, గవర్నరు అక్షినోవ్‌కేసి తిరిగి, అతడు నిజాయితీ మనిషని ఎరుగుండడంచేత, 'నువ్వు సత్యవాదివైన వృద్ధుడవు.

దేవుని ముఖం చూసి చెప్పు. ఎవడు కన్నం తవ్వినవాడు ?' అని అడిగాడు. మకారు సమీనకే అది తన ప్రమేయం ఎంత మాత్రమూ కానట్టు అక్షణోని కీగంట కనిపెట్టడం కంటె గవర్నరుకేసే చూస్తున్నట్టు కనపడుతూ నుంచున్నాడు. అక్షణో చేతులూ పెదవులూ వణికి పోయాయి. కొంత సేపటివరకూ అతనికి జిహ్వరాలేదు. 'నా జీవితం నాశనం చేసిన వాణ్ణి నేనెందుకు కమ్మడం? నన్ను పెట్టిన బాధకి అనుభవిస్తాడు పోనీ! కాని, నేనిప్పుడు సత్యం చెప్పేస్తినా, ఇతణ్ణి కొన ఊపిరి ఉండే వరకూ బాత్తారు. బహుశః, నేనితణ్ణి శంకించడం తప్పేమో! ఇంతాచేసి, ఇందువల్ల నాకు కలిగే మేలేమిటి?' అంటూ అక్షణో తలపోసుగుంటూ ఉన్నాడు. 'ఏం ముసిలయ్యా! సత్యం చెప్పేయ్. ఆ గోడకింద తవ్విన వాడెవడూ?' అని గవర్నరు రెట్టించాడు. అక్షణో మకార్ని కీగంట గమనించి, 'ప్రభూ! నేను చెప్పజాలను. నేను చెప్పడానికి దేవుడికి ఇచ్ఛలేదు. నన్ను మీరు ఏమిచేసినా సరే, చెయ్యండి. నేను మీ చేతులోవాణ్ణిగదా!' అన్నాడు. గవర్నరు మరి యెంత యత్నించినా, అక్షణో అంత కంటె చెప్పలేదు, ఆవిషయం అంతటితో ఆగవలసొచ్చి ఆగింది.

## vii

ఆ రాత్రి అక్షణో తన పక్కమీద పడుకుని కునక పోతూండగా ఎవరో నిశ్శబ్దంగా వచ్చి పక్కమీద కూచున్నారు. ఆ కారు చీకట్లో అతడు తన కళ్ళు చించుకోగా, అతనికి మకారు కనిపించాడు. 'నా దగ్గిర్నించి ఇంకా ఏం కావాలి నీకూ? ఇక్కడికి ఎందు కొచ్చావు?' అని అతడు మకార్ని అడిగాడు. మకారు

సమీనకే మౌనంగా ఉండిపోయాడు. అక్షినో లేచి సూచిని, 'ఏం కావాలో చెప్పు. లేకపోతే, వెళ్ళిపో. వెళ్ళకపోతే, కాపలా భటుణ్ణి కేకేస్తాను,' అన్నాడు. అక్షినో దగ్గిరిగా మకారు వాలి, 'ఇవాన్, నన్ను క్షమించు,' అన్నాడు. అతడు 'ఏ విషయం!' అని ప్రశ్నించాడు. మకారు, 'నేనే ఆ వర్తకుణ్ని చంపి, కత్తి నీ సంచీలో దూర్చాను. అసలు నిన్ను కూడా చంపేసేద్దాం అను కునే అప్పట్లో వచ్చాను, గాని అంతలో బయట ఏదో చప్పు డైంది. అందుచేత కత్తి నీ సంచీలో చటుక్కున దాచేసి, కిటికీ లోంచి నేను బయటికి దూకెయ్య వలి సొచ్చింది,' అని దీనంగా అన్నాడు. అక్షినో తను అప్పుడు ఏం చెప్పాలో తెలియక నిరుత్తరుడై పోయాడు. మకారు సమీనకే కిందికి జారి. నేల మీద మోకరించి, 'ఇవాన్, నన్ను క్షమించు, దేవుడియందు నీ భక్తి తల్చుగుని, నన్ను క్షమించు. వర్తకుణ్ని చంపింది నేనే నని సత్యం చేప్పేస్తాను. నిన్ను వదిలేస్తారు. ఇంటికి వెడుదుగాని,' అంటూ వాపోడం మొదలెట్టాడు. అక్షినో, 'చెప్పెయ్యడం నీకు తేలికే. కాని, నీ మూలంగా నీ బదులు నేను ఈ యిరవై ఆరేళ్ళూ యాతన పడ్డాను. ఇప్పు డెక్కడికి వెళ్ళనూ? నా భార్య గతించింది. నా పిల్లలు నన్ను మరిచి పోయారు. నాకు వెళ్ళేటందుకు చోటులేదు,' అన్నాడు. మకారు సమీనకే లేవలేదు, తల నేలని పెట్టి కొట్టుగున్నాడు. అంటు, 'ఇవాన్ అక్షినో! నన్ను క్షమించు. తోలుపట్టా కొరడాతో నన్ను ఉతిగేటప్పుడు నాకు కలిగిన బాధకంటే, ఇప్పుడు నీ కేసి చూడడానికి కలుగుతూన్న కష్టం ఎక్కువ దుర్భరంగా ఉంది,

అయినా, నువ్వు నా మీద కనికరం వహించి, నన్ను బయట పెట్టకుండా రక్షించావు. క్రీస్తుని తల్చుకుని నన్ను క్షమించు. నేను చాలా నిర్భాగ్యుణ్ని' అంటూ వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టాడు. ఆ ఏడుపులు చెవిని పడగానే అక్షిణో కుడా ఆగ లేక పెద్ద పెట్టున ఏడ్చాడు. అప్పుడు అక్షిణో, 'భగవంతుడు నిన్ను క్షమిస్తాడు, నీ కంటె శతవిధాల నేనే చెడ్డవాణ్ణేమో!' అన్నాడు. ఈ మాటలతో అతని హృదయం తేలికపడి, అతని గృహకాంక్ష తీరిపోయింది. అతనికి చెరసాల విడిచి వెళ్ళిపోవా లనే సంకల్పమే మరి కలగలేదు. అతడు తన చివరి ఘడియ నిరీక్షిస్తూ ఉండిపోయాడు. అక్షిణో వద్దు వద్దని ఎంత పోరినా వినక మకారు సమీనకే తన హత్యానేరం ఒప్పేసుకున్నాడు. అక్షిణోని వదిలివెయ్య వలసిందిగా ప్రభుత్వం ఉత్తరువులు జారీ చేశారు. కాని, అవి నెమ్మదిగా చెరసాల చేరుకోడానికి చాలా పూర్వమే అక్షిణో పరంపదించాడు.



# ఎలుగు వేట

[ఈ క్రింద చెప్పబడ్డ సాహసకృత్యం, కేవలం 'టాల్‌స్టాయ్'కే 1858 లో జరిగింది. మరి ఇరవై సంవత్సరాల తరువాత దయా ధర్మ విచారణ చేసుగుని, అతడు వేట మానేశాడు.]

మేం ఎలుగువేట విహారానికి వెళ్ళాం. నా సహజీవుడు ఒకాయన ఒక ఎలుగుని లక్ష్యం చేసుగుని పేల్చాడు. కాని, దానికి కండదెబ్బ మాత్రమే తగిలింది. మంచుతెరమీద నెత్తురు జాడలు ఉన్నాయి, కాని ఎలుగు చపాయించేసింది. మేం అంతా అడివిలో సమావేశమై, తక్షణమే ఆ ఎలుగువెంట వెళ్ళవలిసి ఉంటుందా, లేక అది మళ్ళీ ఎక్కడో స్థిరపడేదాకా, రెండుమూడురోజులు ఆగలా, అనేది నిష్కర్ష చేసుగోవా లనుకున్నాం. ఆరోజునే ఆ ఎలుగుని చుట్టుముట్టడం శక్యమేనా అని ఎలుగుల్ని మళ్ళేసే రైతుల్ని కనుక్కున్నాం. వాళ్ళల్లో ఒకముసిలాడు, 'అబ్బే. అది కేవలం అసంభవం. ఆ ఎలుగుని కాస్త విమ్మళించ నియ్యాలి. అయిదురోజులపాటేనా ఆగితే, దాన్ని చుట్టుముట్టడం సంభవనీయం. కాని, ఈలోపలే దానివెంటబడితే, దాన్ని బెదరగొట్టడం అవుతుంది, అది మరి ఎక్కడా స్థిరపడడం జరగదు' అన్నాడు. కాని, వాళ్ళల్లో ఒక యువకుడు ఆ ముసిలివాణ్ణి తకాయించి మాట్లాడుతూ, దాన్ని తక్షణమే చుట్టుముట్టడానికి ఎంతో వీలుందని చెబుతూ, 'ఇల్లాంటి మంచు ఉంటూన్నప్పుడు అది అట్టే దూరం వెళ్ళుండదు. ఏమంటే అది బలిసి కొవ్వెక్కిఉంది. అది సాయంత్రంలోపలే ఎక్కడో స్థిరపడుతుంది. ఒకవేళ స్థిరపడదే

అనుకోండి, మంచుచెప్పులమీద వెళ్ళి దాన్ని నే నందుకోగలను' అన్నాడు. నాకు ఆతిథ్యం ఇచ్చిన నా సహజీవుడు తక్షణం ఆ ఎలుగువెంట వెళ్ళడానికి ఇష్టపడక ఆగి వెళ్ళాలనే సలహా యిచ్చాడు. కాని, నేను, 'మనం వాదించడం అనవసరం. మీ యిష్టప్రకారం మీరు చెయ్యండి. కాని, నేను 'దమియా'ని కూడా తీసిగెళ్ళి, పూర్తిగా ఆ ఎలుగుజాడ తీస్తాను. మేం ఆ ఎలుగుని చుట్టుముట్టగలమా, సరేసరి. చుట్టుముట్టలేమా, పోనీ పోయే దేముందీ? ఇప్పు డింకా పొద్దెక్కనేనాలేదు. ఈవేళంతా చెయ్యడానికి మాకు మరేమీ పనిలేదు,' అన్నాను.

ఆరీతిగా ఏర్పాట్లు అయినాయి. తక్కినవాళ్ళంతా వెనక్కి నడిచి మంచుబళ్ళెక్కి గ్రామానికి వెళ్ళిపోయారు. దమియా నేనూ కొంచెం రొట్టె పుచ్చుగుని అడివిలో దిగడిపోయాం. వాళ్ళంతా వెళ్ళిపోయిం తరవాత, దమియా నేనూ మా తుపాకులు సోదాచేసి సరిచూసుగుని, మా వెచ్చకోట్ల అంచులు పటకాలకి లోపలవేసి బిగించేసుగుని, ఆ ఎలుగు జాడలు పట్టుగుని బయల్దేరాం. వాతావరణం చక్కగా మంచుగడ్డకట్టే వాటంగా ప్రశాంతంగా ఉంది. కాని, మంచుచెప్పుల్తో నడవడం మహా శ్రమ అయింది. (మంచుచెప్పు ఎనిమిది అడుగుల పొడుగూ నాలుగడుగల వెడల్పాగల బల్లచెక్క). మంచు లోతుగానూ మెత్తగానూ ఉంది. అడివి ప్రాంతంలో, ఉపరిభాగం ఏక అట్టకించ గడ్డకట్టక పూర్వమే, ఆ క్రితంరాత్రి తాజాగా మంచుకురిసింది. అందుచేత మంచుచెప్పులు ఆ మంచులో ఆరంగుళాలు కిందికిపోయాయి, ఒకొక్కప్పుడు ఇంకా లోతుకి దిగాయి.

కొంతదూరాన్నించే ఆ ఎలుగుజాడలు కనిపించాయి. అది ఎట్లా నడిచి వెడుతూండి ఉండేదో మేం చూడగలిగాం. ఒక్కొక్కప్పుడు అది పొట్టదాకా మంచులో దిగబడి, మంచుని పైకి దున్నుకుంటూ వెళ్ళింది. మొట్టమొదట, పెద్దపెద్ద చెట్లకింద మేం ఉన్నప్పుడు దాని అడుగులు దృష్టిలో ఉంచుగుంటూనే నడిచాం. కాని, అది చిన్న దేవదారు చిట్టడివిలోకి మళ్ళినచోట దమియా ఆగిపోయి, 'ఇక మనం దాని అడుగుజాడలు వదిలెయ్యాలి. అది ఈ ప్రాంతాన్నే ఎక్కడోస్థిరపడుండాలి బహుశా. అదుగో ఆ స్థలంలో మంచుకేసి చూడండి, అది అక్కడ కూచుని ఉండాలి. దాని అడుగుల్నిబట్టి వెళ్ళడం మానేసి, ప్రదక్షిణం చేద్దాం. కాని మనం చాలా నిశ్శబ్దంగా వెళ్ళాలి, కేకెయ్యకూడదు, దగ్గకూడదు. శబ్దం వింటా, అది బేజారెత్తి పారిపోతుంది' అన్నాడు. అందుకని మేం దాని దారి విడిచిపెట్టి, ఎడంవేపు తిరిగాం. కాని, మేం సుమారు అయిదువందలగజాలు వెడితిమి గదా, మళ్ళీ ఆ ఎలుగు జాడలు మాకు ప్రత్యక్షం! ఈమాటు అవి పట్టుగునే మేం నడవగా, అవి మమ్మల్ని ఒక రోడ్డెక్కించాయి. అక్కడ మేం ఆగి, ఆ ఎలుగు ఎటువెళ్ళుంటుందో గ్రహించడానికి రోడ్డు తణిఖీచేశాం. అక్కడక్కడ ఆ మంచులో ఆ ఎలుగు పంజా, గోళ్ళూ సహ స్పష్టమైనగల ముద్రలున్నాయి. అవికాక రైతుయొక్క మట్టిచెప్పుల ముద్ర లున్నాయి అక్కడక్కడ. ఆ ఎలుగు గ్రామంకేసే వెళ్ళినట్టు విశదం అవుతోంది. రోడ్డుమీద దానిజాడలు చూస్తూ మేం వెడుతూండగా, దమియా, 'ఇప్పుడు మనం రోడ్డుకేసి చూసిలాభంలేదు. అది రోడ్డుని కుడి

వేపునో ఎడమవేపునో ఎక్కడ వదిలేసిందో తెలుసుగోడానికి, రోడ్డుపక్కనుండే మెత్తటి మంచులో గుర్తులకోసం చూడాలి. అది ఎక్కడో అక్కడ పక్కకి తిరుగుండాలిగాని, తిన్నగా గ్రామానికి వెళ్ళడం ఇష్టపడుండదు.' అన్నాడు.

మేం ఆ రోడ్డుమీద దగ్గిరిగా ఒక మైలు నడిచాం. అక్కడ, ఆ ఎలుగు జాడ రోడ్డుమీంచి పక్కకి పోతూన్నట్టు మేం చూశాం. రోడ్డుపక్క ఉన్న ముద్రలు మేం తణిఖీచేశాం. ఏమి విపరీతం! రోడ్డుమీది జాడలూ రోడ్డుపక్క జాడలూ ఒకే ఎలుగు దారిలాగ కనబడుతూన్నా, రోడ్డుపక్క నున్నవి రోడ్డుమీంచి అడివిలోకి వెళ్ళే ఎలుగువి లాలేవు. అడివిలోంచి రోడ్డెక్కే ఎలుగు విలా ఉన్నాయి: ఏమంటే, పంజాముద్రలో గోళ్ళనొక్కులు రోడ్డుకేసే ఉన్నాయి. నేను, 'అది మరొక ఎలుగు అయుంటుంది,' అన్నాను. దమియా ఆ జాడకేసి చూస్తూ కొంతసేపు ఆలోచనలోపడి, 'కాదు కాదు. ఆ ఒక్క ఎలుగే. అదే తమాషా చెయ్యడానికి, రోడ్డు వదిలి వెళ్ళేటప్పుడు వెనక నడక నడుస్తూ వెళ్ళింది,' అన్నాడు. ఆ పక్కదారిపట్టి మేం నడిచి చూడగా ఆ సంగతి యథార్థమే. ఆ ఎలుగు రోడ్డునించి పది అడుగులు వెనకనడకని వెళ్ళి అక్కడ ఒక దేవదారు వెనక మామూలుగా తిరిగి నడుచు గుంటూ పోయింది. దమియా ఆగిపోతూ, 'ఇక మనం దాన్ని రూఢిగా చుట్టుముట్టగలం. మన యెదటే ఒక దాడవ ఉంది. అది అందులో స్థిరపడి ఉంటుంది. మనం ఆ దాడవచుట్టూ తిరుగుదాం,' అన్నాడు. ఆ చుట్టి రావడంలో ఒక దేవదారు చిట్ట దళిగుండా వెళ్ళడం మొదలెట్టాం. అప్పటికే నేను పూర్తిగా

అలిసిపోయున్నాను. దానికి తోడు ముందుకి వెళ్ళడమనేది లోగడకంటె కష్టతరంకుడా అయిపోయింది. నేను ఫ్లెకసింత చెట్లకేసో జారిపోగా నా మంచు చెప్పులు వాటిల్లో చిక్కడేవి. మరోసారి నాపాదాలమధ్య ఒక చిన్న దేవదారు కనిపించి ఊయకునేది. లేకపోతే, నాకు అభ్యాసం లోటవడంవల్ల, నా మంచు చెప్పులు తప్పిజారి పోయేవి. ఇంకో అప్పుడు మంచులో కప్పడి ఉండే ఏమోడుకేనా ఏ మొద్దుకేనా వెళ్ళికొట్టుగునేవి. నేను అత్యంతంగా అలసటపడి చెమటతో తడిసిపోయి నా ఉన్నికోటు తీసేశాను. కాని, దమియాకేసి చూస్తునుగదా, ఇంతసేపూ అతడు పడవలో వెడుతూన్నట్టు అలా సవ్వరిగా జారుతున్నాడు. అతడి మంచుచెప్పులు బుద్ధి పూర్వకంగా అవే జరుగుతున్నాయా అన్నట్టు జరుగుతున్నాయి, వెళ్ళి దేనికీ చిక్కడవు, తప్పి జారీ పోవు. అతడు నా ఉన్నికోటు తీసుగుని తన భుజం మీదే వేసుగునికుడా తనేముందుండి త్వరగా రమ్మని నన్ను తొందర చేస్తూనే ఉన్నాడు.

మరో రెండు మైళ్ళు నడిచి మేం ఆ బాడవ ఎదరవేపుకి వచ్చాం. నేను వెనకాల దిగడ్డాను. నా మంచు చెప్పులూ తప్పి జారి పోతూండమే, నా పాదాలూ తడబడుతూండడమే. దమియా నాకంటె ముందే తను వెడుతూ, అథాత్తుగా ఆగిపోయి, తన రెక్క ఊగించాడు. నేనతణ్ణి అందుకోగానే, అతడు వంగుని, చేత్తో చూపిస్తూ రహస్యంగా, 'ఆ అడివి మొక్కలగుంపుపైన వాలి ఒక కొండకాటిగాడుపిట్ట వాగుతోంది గమనించారా? అది చాలా దూరాన్నించే ఎలుగుని పసికట్టగలదు. అందుకని, అక్క

డుంటుంది ఆ ఎలుగు,' అన్నాడు. మేం పక్కకి తిరిగి మరో అరమైలు వెళ్ళగానే పాతజాడ దగ్గిరికి వచ్చేశాం. అందుచేత మేం ఆ ఎలుగుకి ప్రదక్షిణం చేశాం అన్నమాట, మేం వదిలి పెట్టొచ్చిన అడుగుజాడల వలయంలో అది ఉందన్నమాట. మేం ఆగిపోయాం. నేను నాటోపీ తీసేసి, దుస్తులన్నీ వదలు చేసుగున్నాను. నేను నీటావిరి పట్టినట్టు వేడెక్కిపోయాను, మురుగుతూంలో కొట్టుకుపోయే యెలకలాగ తడిసిపోయాను. దమియో మొహంకుడా కందిపోయింది. అతడు తన చొక్కా చేతుల్తో తన మొహం తుడుచుగుంటూ, 'సరేమరి, స్వామీ, మనపని మనం చేశాం, మనకి విశ్రాంతి ఉండి తీరాలి' అన్నాడు.

అస్తమయ సూర్యుడిప్రభవల్ల అడివి ఎరుపెక్కింది. మేం మా మంచు చెప్పులు విడిచి, వాటిమీదే కూచుని, కొంచెం రొట్టీ ఉప్పూ సంచీల్లోంచి పైకి తీశాం. నేను మొదట కొంచెం మంచు తిని తరవాత రొట్టె తిన్నాను. ఆ రొట్టె రుచి ఏమని చెప్పను! రొట్టెకి అంత రుచి ఉండడం నా జీవితంలో ఎన్నడూ ఎరగననిపించింది. కాస్త చీకటి పడేదాకా మేం అక్కడే విశ్రాంతిగా కూచున్న తరవాత అక్కడికి గ్రామం చాలా దూరమా అని దమియాని అడిగాను అతడు, 'ఆ—దూరమే. ఎనిమిదిమైళ్ళు ఉండి తీరింది. అక్కడికి ఈ రాత్రే వెళదాంగాని, ఇప్పుడు మనం విశ్రమించి తీరాలి. మీ ఉన్నికోటు తొడుక్కోండి, స్వామీ, లేకపోతే మీకు రొంప పట్టేస్తుంది,' అన్నాడు. దమియా ఒకచోట మంచుని చదునుచేసి, దేవదారు కొమ్మలుకొట్టి తెచ్చి పరుపులాగ చేశాడు. మేం ఒకరి సరసని ఒకరు పడుకున్నాం.

చేతులే మాకు తలగడా లైనాయి. ఎల్లా నిద్దరపట్టిందో నాకు జ్ఞాపకంలేదు. రెండుగంటల తరవాత ఏవో చిటపట ధ్వని విని నేను లేచాను. నాకు నిద్ర ఎంత గాఢంగా పట్టిందంటే, అప్పుడు నేనెక్కడ ఉంటున్నానో నాకు తెలియలేదు. నా చుట్టూచూశాను. ఎంత అద్భుతంగా ఉందీ! నేను ఏదోదివాన్‌ఖానాలో ఉన్నాను. తెల్లటి వెలుగు స్తంభాలతో అది అంతటా మెరిసి పోతోంది. కిటికీల మీదుండే లలితమైన తెల్లటి నగిషీగుండా ఒక కారు నలుపు గుహ కనబడుతోంది. దాన్నిండా రంగు దీపాలు పొది గారు. ఇంకా బాగానేను చూస్తిని గదా, మేం అడివిలో ఉన్నట్టు నాకు జ్ఞాపకం వచ్చేసింది. నేను దివాన్‌ఖానాలో స్తంభా లను కున్నానే అవి మంచుతోటీ గడ్డమంచుతోటీ కప్పడిఉన్న చెట్లు. మరి ఆ రంగు దీపాలు, కొమ్మల్లోంచి మిల మిల లాడే నక్షత్రాలు.

చలి మంచు రాత్రి ఉంటూనే ఉంది. రెమ్మలన్నీ దాని మూలాన్ని లావైనాయి. దమియా నిండా అదే. నా ఉన్నికోటు మీదంతా అదే. అది చెట్లనించి రాల్తూనే ఉంది. నేను దమియాని లేపాను, మేం మంచు చెప్పులు కట్టుగుని బయల్దేరాం. అడివి మహా నిశ్శబ్దంగా ఉంది. ఆ మెత్తటి మంచులో మా మంచు చెప్పులు తోసుకుపోవడం తప్ప మరేమీ వినిపించలేదు. ఎప్పు డేనా చలిమంచు బరువుకి ఏ చెట్టేనా పెళ్ళుమని విరిగిపోతే అప్పుడు మాత్రం అడివి మారుమోగేది. ఒకసారి ఏదో మా పక్క నించి మమ్మల్ని రాసుగుంటూ వెళ్ళి తుర్రుమంది. ఆ ఎలుగే అని నేను అనుకోడం మొదలెట్టానుగాని, ఆ ధ్వని బయల్దేరిన

చోటికి మేం వెళ్ళగానే కుందేళ్ళ కాలిముద్రలు మాకు కనిపించాయి. అవి పళ్ళతో బెరళ్ళు కొరికేసిన కొన్ని బూరుగుచెట్లు కుడా ఉన్నాయి. కొన్ని కుందేళ్ళు ఆ బెరళ్లు తింటూంటే మేం వాటిని బెదర గొట్టాం అన్నమాట. క్రమేపీ మేం రోడ్డెక్కి-అది పుచ్చుగున్నాం. మంచుచెప్పులు విడిచేసి, వాటిని మా వెనకాల ఈడ్చుగుంటూ పోయాం. ఇప్పుడు నడక తేలికగా ఉంది. రోడ్డు గట్టిగా రాయల్లా ఉందేమో, మంచు చెప్పులు ఇటో అటో ఒరుగుతూ మా వెనకాల ఏక కట కట మంటూండడం. మా బూట్సు కింద మంచు ఏక కరకర లాడుతూండడం. మిక్కిలి చల్లటి గడ్డ మంచు మా మొహాలమీద పువ్వారంలాగ సర్దుకుంది. చెట్లమధ్య నించి చూస్తే నక్షత్రాలు మమ్మల్ని కలుసుగోడానికి పరిగెత్తుకు వస్తూన్నట్టుగానూ, అవి ఇట్టే తళుక్కుమని ఇట్టే మాయం అవడం గమనిస్తే ఆకాశం యావత్తూ కదిలి బయల్దేరి నట్టుగానూ, కన పడింది.

మేం గ్రామం చేరేసరికి. నా సహజీవుడు నిద్రిస్తున్నాడు. నేనతణ్ణి లేపి, ఎలుగుని ఎల్లా చుట్టుముట్టి వచ్చామో అతడికి వివరించాను. ఎలుగు మళ్ళవేతగాళ్ళని కొందర్ని ఉదయానికల్లా పోగయేటట్టు చూడాలని మా కాతిథ్యం ఇచ్చిన రైతుతో చెప్పాం. రాత్రి భోజనం చేసుగుని, పడుకున్నాం. నేనుపడ్డ బడలికకి ఆ పడుకోడం మర్నాడు మిట్ట మధ్యాహ్నం వరకూ లేవకేపో దును. కాని, నా సహజీవుడు నన్ను లేవగొట్టాడు. నేను దూకుతూ లేచి, అతడు అప్పటికే వేషం వేసేసుగుని తుపాకీపని ఏహో చూడడంలో లీనం అయున్నాడని గ్రహించాను. నేను 'దమిషూ

ఏడీ?' అని అడిగాను. అతడు, 'అడివికి వెళ్ళాడు, చాలా పెందలాడే వెళ్ళి, మీరు నిన్న తొక్కివచ్చిన దారంతా ఒకమాటు చూసేసి, వెనక్కివచ్చి, మళ్ళ వేత మనుషుల గురించిన జాగర్త పడడానికి వెళ్లాడు.' అన్నాడు నేను స్నానంచేసి, దుస్తులు ధరించి, తుపాకులు ధట్టించాను. తరవాత మేం ఒక మంచు బండి యెక్కి బయల్దేరాం.

కరిచేస్తూన్న ఆ గడ్డ మంచు ఇంకా కురుస్తూనే ఉంది. అంతా ప్రశాంతంగాఉంది. సూర్యుడు కనబడడంలేదు. మా మీద దట్టమైన పొగమంచు పట్టింది. గడ్డమంచు ఇంకా అన్నింటినీ కప్పిఉంది. బండిమీద రోడ్డువెంట రెండుమైళ్లు వెళ్ళి, ఇక అడివి సమీపిస్తూన్నాం అనగా, ఒక పల్లంలోంచి ఒక పొగమేఘం లేవడం గమనించాం. మరి కాస్సేపట్లో అక్కడున్న రైతులగుంపు చేరాం. అందులో పురుషులూ స్త్రీలూ కుడా బడితెలు ఆయుధాలుగా పుచ్చుగుని ఉన్నారు. మేం బండిదిగి వాళ్ళదగ్గిరికి వెళ్ళాం. మొగాళ్లు బంగాళాదుంపులు వెయిస్తూ కూచుని, నవ్వుతూ స్త్రీలతో ప్రసంగాలు చేస్తూ ఉన్నారు. దమియాకుడా ఉన్నాడు. అక్కడ. మేం దగ్గిరికి వెళ్ళగానే వాళ్ళంతా లేచి నుంచున్నారు. మేం క్రితం రోజున తొక్కివచ్చిన వలయంలో వాళ్ళని స్థానాల్లో నిలబెట్టడానికి దమియా వాళ్ళని నడిపించుకు వెళ్ళాడు. ఆ స్త్రీ పురుషులు మొత్తం ముప్ఫైమందీ ఒక్కొక్కరి చొప్పున వెనక వెనకనే నడుస్తూవెళ్ళారు. మంచు ఏమాత్రం లోతుగా ఉందంటే, వాళ్ళ నడుములపైనే మాకు కనిపించారు. వాళ్ళు అడివిలోకి వెళ్ళగానే నా స్నేహితుడూ నేనూ వాళ్ళదారి అనుసరించాం.

వాళ్ళు ఒక దారంటూ ఏర్పడేటట్టు తొక్కుకుని వెళ్ళినా, నడక మాకు కష్టంగానే ఉంది, అదొక పక్షం. కాని, రెండో పక్షం ఏమిటంటే, పడిపోవడ మనేది అసంభవం. రెండు మంచు గోడల మధ్య నడుస్తూన్నట్టుంది. అల్లా మేం ఒక అరమైలు వెళ్ళేసరికి, దమియా మరొక దిశనించి మాకేసి తన మంచు చెప్పులమీద పరిగెత్తుకునివస్తూ, తనని కలుసుకోవలసిందని మాకు సంజ్ఞచేశాడు. అతనికేసి మేం వెళ్ళగా, మేంఎక్కడ నుంచోవాలో అతడు చూపించాడు. నా స్థలంలో నేను నుంచుని చుట్టుపట్లు పరకాయించాను.

నా ఎడంచేతివైపు ఎత్తుగా దేవదార్లున్నాయి. వాటి మొదళ్ళ సందుల్లోంచిచాలాదూరంఆన్తోంది. వాటికి ఎంతో వెనక ఒక మళ్ళ వేత మనిషి కేవలం ఒక నల్లటి మచ్చలాగ కనిపిస్తున్నాడు. నాకు ఎట్టయెదర మనిషెత్తున దేవదారు చిట్టడవి ఉంది. వాటి కొమ్మలు మంచుమూలాన్ని వాలిపోయి అతుక్కుపోయాయి. ఆ చిట్టడివిగుండా పూర్తిగా మంచు కప్పిన దారి ఒకటి నాదిశగా ఉండి నేనుంచున్న స్థలం దాకా వస్తోంది. నా కుడి వైపునకూడా ఆ చిట్టడివి వ్యాపించి అంతంతాగా దానికి అవతలుండే ఖాళీ కన పడుతోంది. నా షికారీదృష్టి దమియా అక్కడ నుంచోపెట్టినట్టు కూడా నాకు తెలుస్తోంది. నేను నా తుపాకులు తనిఖీ చేసుకుని, సరిగ్గా ఎక్కడ నుంచోడం నయమూ అని ఆలోచించాను. నాకు మూడుగజాల వెనకాల ఒక ఎత్తైన దేవదారు ఉంది. నేను, 'నుంచోడానికి అదేచోటు. అక్కడైతే వెంతో తుపాకీ చెట్టుకి ఆనించి పెట్టుకోవచ్చు,' అనుకున్నాను. అనుకుని, అడుగేసే

సరికి మంచు మోకాళ్ళదాకా వస్తూండగా. చెట్టుకేసి జరిగాను. మంచుని కాల్తో చిమ్మేసి నిలబడడానికి ఓ చదరపు గజం స్థలం తెరిపిచేసుగున్నాను. ఒక తుపాకీ చేతులో ఉంచుగున్నాను. రెండోది, లాగడానికి సిద్ధంగాచేసి, ఆ చెట్టుకి జార్లేశాను. మూతి పైకెట్టి అవసరం అయినప్పుడు కటారి సర్వసిద్ధంగా ఉందని రూఢీచేసుగోడానికి, ఇప్పుడే దాన్ని ఒరలోంచి లాగేసి పక్కనే పెట్టేసుగున్నాను. ఈ పూర్వసన్నాహాలన్నీ పూర్తిచేసుగున్నాను గదా అనుకోగానే, అడివిలోంచి దమియా 'ఎలుగు లేచింది. ఎలుగులేచింది' అని కేకేశాడు.

దమియా అల్లా కేకపెట్టగానే, వలయంలో ఉన్న రైతులంతా 'లే లే లే అవు అవు అవు' అంటూ బొబ్బలెట్టారు, స్త్రీలంతా 'ఐ ఐ ఐ' అంటూ గింగుర్లెత్తారు, ఎలుగు వలయంలో ఉంది. దాన్ని దమియా తరుముతున్నాడు. జనం, చుట్టూరా. గావుకేక లేస్తున్నారు. నా మిత్రుడూ నేనూ మాత్రం, ఎలుగు మాకేసి ఎప్పుడొచ్చిపడుతుందో అని కనిపెట్టుగుని, మౌనంగా ప్రతిమల్లాగ ఉండిపోయాం. రెప్పవెయ్యకుండా చూస్తూ చెవులు నిక్కపొడుచుగుని వింటూ అల్లా నేను నుంచుని ఉండగా, నా గుండె దడదడా కొట్టుగుంది. తుపాకీ మాత్రం గట్టిగా పట్టుగుని, నేను తెగవణికిపోయాను. నేను నాలో, 'సరే సరే. అఘాత్తుగా అది వస్తుంది, చటుక్కున గురిచూస్తాను, ఠపీమని పేల్చేస్తాను, దభీమని అది కూలిపోతుంది, అనుకున్నాను. అఘాత్తుగా నా ఎడం వేపున, చాలా దూరంగానే, ఏదో మంచు మీద పడ్డట్టు చప్పుడు వినపడింది. ఆ పొడుగాటి దేవదారు మొవళ్ళ సందులగుండా

నేను చూస్తినిగదా, ఓ యాభై అంగల దూరంలో, మొదళ్ళ వెనకాల, పెద్దదిగా నల్లగా ఏదో ఉంది. నేను గురిచూసి, 'ఇంకా దగ్గిరికి రాకపోతుందా?' అనుకుంటూ కనిపెట్టుగుని ఉన్నాను. అల్లా నేను కనిపెట్టుగుని ఉండగా, అది ఒకసారి చెవులు విదిలించి, తిరిగి, వెనక్కి వెడుతోంది. అప్పుడు దాని యావత్తుకీ పార్శ్వదృశ్యం యొక్క క్షణిక దర్శనం నాకైంది. అది చాలా బ్రహ్మాండమైన గొడ్డు. నా కంగారులో నేను పేల్చేశాను. గుండు వెళ్ళి ఒక చెట్టుమానుకి ఠక్కున కొట్టుగుంది. కళ్ళు దగ్గిరచేసి పొగలోంచి చూడగా, ఎలుగు మళ్లీవలయంలోకే పాకిపడి. చెట్లల్లో మాయం అయింది. నేను, 'సరే తీరిపోయింది. నా తరుణం నేను పోగొట్టేసుగున్నాను. అది నా దగ్గిరికి మళ్లీ రాదు. నా సహజీవుడు దాన్ని పేల్చనేనా పేలుస్తాడు, లేకపోతే అదిమళ్ళ వేతగాళ్ళ సందులోంచి తప్పించుగునేనా పోతుంది. ఏమైతేం, నాకు మరో తరుణం దక్కనియ్యదు,' అనుకున్నాను. కాని, ఎందుకేనానయం అని, నేను నా తుపాకీ తిరగ ఠట్టించి మళ్ళీ ఆలకిస్తూ నుంచున్నాను. మళ్ళీ చుట్టూ రైతులు అరవడం మొదలెట్టారు. కాని. నా కుడిపైపున, నా అంతరంగికుడు నిల బడ్డ చోటికి అట్టేదూరం కానిచోట, ఒక స్త్రీ పిచ్చి ఆవేశం సూచించే కంఠంతో కీచుమంటూ. "ఇక్కడుంది, ఇక్కడుంది, ఇల్లారండి, ఇల్లారండి, ఓహో ఓహో ఐఐ" అని లబలబ లాడింది. ఆమె ఎలుగుని చూసిందని విశదం అపుతోంది. నేను దానికోసం ఎదురు చూడ్డం మానేసేసి, కుడిచేతివేపున ఉన్న నా సహజీవుడికేసి చూస్తూ ఉన్నాను. అమాంతంగా దమిత్రీ తన

చేతులో ఒక కర్ర పట్టుగుని మంచు చెప్పులులేకుండా ఒక కాలి దారివెంట నా స్నేహితుడికేసి పరిగెత్తుతున్నాడు. అతని పక్కనే నేలమీద వాలి, దమియా ఆకర్రతో గురిచూస్తూన్నట్టు దేనికేసో చూపిస్తున్నాడు. అప్పుడు నా స్నేహితుడు తుపాకీ ఎత్తి ఆదిశ లోనే గురిచూసి, క్లిక్ మని లాగి, ఢాం అని పేల్చాడు. నేను, 'మరేం? అతడు దాన్ని చంపేశాడు,' అనుకున్నాను. కాని, నా సహజీవుకు ఎలుగుండే దిశలో పరిగెత్తదే; అడిగేదేమిటీ, గుండు గురి తప్పైనా ఉండాలి, లేక దెబ్బ పూర్తిగా గుణం ఇయ్యకుండానేనా ఉండాలి. నేను, 'ఇక ఎలుగు మరి వెళ్ళి పోతుంది. అది వెనక్కి తిరుగుంది. అంతేగాని, రెండోసారి, నాకేసి, ఎంతమాత్రమూ, రాదు. కాని, అట్టెట్టెట్టె, ఇదేమిటీ!

సుడిగాలిలాగ బుసకొట్టుగుంటూ ఏదో నాకేసి వచ్చేస్తోంది. మంచు, పైకి ఎగిరిపోవడం నాకు కనపడుతోంది. నా ఎదరికి ఒక్కచూపు చూశాను. మరెవరు? ఎలుగు! చిట్టడివిలోంచి ఇవతలికున్న దారివెంట సూటిగా నా దిశలో చొచ్చుగుని వస్తోంది. అది ఇల్లారావడం అతిభయంవల్ల మతిపోయి—అని తెలిసిపోతోంది. అయిదారంగల దూరంలో అది ఉందీ అనగా దానిమూర్తి నేను పూర్తిగా చూడగలిగాను—దాని నల్లటి ఛాతీ, ఎంతో పెద్దతలా, దానిమీద రక్తపు డాగునూ. దాని రావడం మతిలేని రావడం అయినా సూటిగా నా మీదికే అయింది. వస్తూ అది మంచుని ఇటూ అటూ రేగకొట్టేస్తోంది. దాని కళ్ళయొక్క వాలకంచూస్తే, అది నాకేసి చూడడమేలేదు. భయంవల్ల పిచ్చెత్తి పోయి కళ్ళుమూసుగుని అది ఎటోలటు దౌరబడడం జరగగా,

దాని వెఱ్ఱిమార్గం సూటిగా ఆ చెట్టుకేసే అయింది. ఆ చెట్టుకింద నేనున్నాను. నేను తుపాకీ బారెట్టి పేల్చాను. అది నామీదికే వచ్చేస్తోంది. ఏమంటే నేను గురితప్పిపోయాను. నా రవ్వ దాని పక్కనించి పోయింది. దాని పేలుడుకుడా ఎలుగువినిపించుగున్నట్టే లేదు. ఇంకా నాకు ముఖాముఖీగా అది కళ్ళుమూసుగుని వస్తూనే ఉంది. నా తుపాకీ మూతిదించి, నేను మళ్ళీ పేల్చాను. దాని తల ముట్టుగుంటూన్నంతపనిచేసి. ఠక్ ! దాన్ని కొట్టాను. కాని దాన్ని చంపలేకపోయాను. అది దాని తలఎత్తి, చెవులు నిక్కపొడుచుగుని, కోరలుచూపిస్తూ, నామీదికి వచ్చింది. నేను నా రెండో తుపాకీ దొరకపుచ్చుగో బోయాను. కాని, తుపాకీని నేనింకా ముట్టుగోకపూర్వమే, అది విరుచుగుని నామీద పడడంలో ఆ మంచులోకి నన్ను బోల్తావెయించేసి. తను నన్నుదాటివెళ్ళి పడింది. 'ఇక్కడికి కృతార్థుణ్ణే. ఇది నన్ను వదిలిపెట్టేసింది.' అనుకున్నాను.

నేను లేవడానికి యత్నించాను. కాని. నన్ను ఏదోగాని కిందికి అణిచిపెట్టుంచి, పైకి నన్ను లేవనియ్యకుండా ఉంది. ఎలుగు నామీద చొరబడ్డ వేగంలో అది నన్నుదాటి కొంతమేర వెళ్ళినా, అది వెనక్కితిరిగి వచ్చి, దాని కళేబరం బరువంతా నామీద ఆనింది. ఏదో దారుణమైన బరువు నన్ను దిగలాగేస్తోందేమిటా అనిపించింది. నా ముఖంమీద ఏదో వేడిగా తగుల్తోందేమిటా అనిపించింది. నాముఖం యావత్తూ అది తన నోట్లోకె లాక్కుంటూన్నమాట వాస్తవం అని నాకు అనుభవం అయింది. ఇదివరకే నా ముక్కు దానినోట్లో చిక్కడిచి. అందుకని దాన్లోని వేడీ

నాకు కొట్టింది. దాని రక్తంయొక్క వాసనా నాకు వేసింది. నేను కదలడానికి శక్యంకాకుండా అది తన పంజాల్తో నా భుజాల్ని కిందికి అణిచిపెట్టేసింది. అది తన కోరలు నా ముక్కులోకీ నా కళ్ళల్లోకీ గుచ్చెయ్యాలని యత్నంచెయ్యగా, నేను చెయ్య గలిగిందంతా ఏమిటంటే,నా తలకాయ దాని నోట్లోంచి కిందికి నా ఛాతీకేసి లాక్కుని, పోనీ ముక్కూ కళ్ళూయేనా విడుదల అయే టట్టు చూడడం. తరవాత, అది ఎంజేసిందంటే, నా నుదురు జుట్టుకిందిభాగం తన కిందిదవడ పళ్ళతోనూ, నా కళ్ళకింది మాంసం తన పైదవడతోనూ దొరకపట్టుగుని, తన దవడలు దగ్గిరగా మూయబోతోంది. నా ముఖం యావత్తూ కత్తులెట్టి కోస్తూన్నట్టయింది. నేను విడిపించుగోడానికి గిజగిజా కొట్టు గున్నాను. కొరుకుతూన్నప్పుడు కుక్కలాగ అది తనదవడలు దగ్గిరగాచేసుగోడానికి తొందరపడింది. ఎల్లానో మెలెట్టి నాతల బయటికి లాగేసుగున్నాను. ఎలుగు నాతల తననోట్లోకి లాక్కో డానికి మళ్ళీ యత్నించింది. నేను, 'ఇంక సరి. నామరణం వచ్చే సింది.' అనుకున్నాను.

వెంటనే బరువు తీసేసినట్టు నాకు అనిపించింది. పైకిచూశాను. అది మరక్కడ లేనేలేదు. అది నా దగ్గిర్నించి దూకేసి పారి పోయింది. ఈపని ఎల్లా జరిగిందీ అంటే, ఆ ఎలుగు నన్ను దొర్లించేసి ఇబ్బందిపెట్టడం నా సహజీవుడూ, దమియా కుడా చూసి, నన్ను విడిపించడానికి ఛట్టున వచ్చారు. నా సహజీవుడు తొందరలో పొరబడి, తొక్కినదారివెంట పోవటంబమలు మంచు లోతుగాఉన్నచోటికి వెళ్ళి పడిపోయాడు, ఆ మంచులోంచి పైకి

రావడానికి అతడు తంటాలు పడుతూండే సమయంలో ఎలుగు నన్ను కొరికెయ్యాలని చూస్తోంది. కాని, దమియా, ఉన్నవా డున్నట్టుగా, తుపాకీ యేమీలేకుండానే, కర్రా తనూ దారివెంట ఎగబడుతూ, 'అది ప్రభువుని తినేస్తోంది, అది ప్రభువుని తినే స్తోంది,' అని కేకలేశాడు. అల్లాగే పరిగెడుతూ, ఎలుగుని, 'ఛీ ఛీ పోకుంతా! ఏమిటే నువ్వు చేస్తూ-టా! వదిలెయ్, వదిలెయ్' అంటూ సంబోధించాడు. ఆ యెలుగు అతణ్ణి అనువర్తించి, నన్ను వదిలేసి, లేచిపోయింది. నేను లేచినప్పుడు, గొఱ్ఱెని చంపితే ఉండేటంత నెత్తురు ఆ మంచుమీద ఉంది. పైగా నాముఖ కండ కండరాలు నా కళ్ళఎదట పీలికలులాగ వేళ్ళాడిపోయాయి. అయినా అప్పటి ఉద్రేకంలో నాకేమీ బాధ అనిపించలేదు. ఈ సమయానికి నా సహజీవుడు నా దగ్గిరికి వచ్చాడు, తక్కిన వాళ్ళంతా కుడా మూగారు. నాగాయాలు చూసి వాళ్లు వాటిమీద మంచు ఉంచారు. నేను నా గాయాల సంగతి మరిచేపోయి. 'ఆ ఎలుగు ఎక్కడుందీ? ఏవేపు వెళ్ళిందీ?' అని అడిగాను. అకస్మికంగా 'ఇదుగో, ఇదుగో' అని వినపడ్డాయి.

ఎలుగు మాకేసి పరిగెత్తుకుంటూ మళ్ళీరావడం మేం చూశాం. మేం తుపాకులు పట్టుగున్నాం. కాని, ఎవరూకుడా పేల్చడానికి వ్యవధిలేకుండానే, అది మా పక్కనించి పరిగెత్తింది. అది భయంకరమైన క్రోధంతో వచ్చి నన్ను కొరికిపారెయ్యాలని ఎంచింది. కాని, అంతమంది జనాన్ని చూసి భయపడిపోయింది. దాని అడుగుచారచూసి దానితల రక్తం కారుస్తూన్నట్టు గ్రహించు గున్నాం. ఆ జాడనివెళ్లి దానిసంగతి చూడదల్చుకున్నాం. కాని,

నా గాయాలవల్ల నాకు వేదన దుర్భరం అవడంచేత, అటువెళ్ళడం బదులు, డాక్టర్ని పట్టుకోడానికి పట్నంవెళ్ళాం. డాక్టరు నా గాయాలు పట్టుతో కుట్టెయ్యడంవల్ల, అవి త్వరలోనే నయం అవడం మొదలెట్టాయి.

ఒకనెల గడిచిన తరవాత ఆ ఎలుగునే వేటాడడానికి వెళ్లాం. కాని, దానిపని సమాప్తం చెయ్యడానికి తరుణం నాకు రాలేదు. అది వలయందాటి రావడానికి ఇష్టపడక అందులోనే గిరగిరా తిరుగుతూ భయోత్పాదమైన కంఠస్వరంతో మొరుగుతూ ఉంది. దాన్ని చంపినవాడు దమియా. దానియొక్క కిందిదవడ నేను పేల్చిన రవ్వతో, ముక్కముక్కలైంది, ఒక దంతం ఊడి అవతలపడింది. అది చాలా భారీజీవుడు. దాని నల్లటి ఉన్ని పసందుగా ఉంది. దాని చర్మం బాగుచేయించి దాని ఆకారంలోనే కుట్టించాం. అది నా గదిలోనే ఉంటుంది. నా నుదుటి మీది గాయాలుకుడా పూర్తిగా నయం అయినాయి. ఇప్పు డక్కడ వాటి ఆనవాళ్ళుకుడా లేవు.

# ఎక్కడ కనికరం ఉంటే, అక్కడ దేవుడు ఉంటాడు.

ఒకానొక పట్టణంలో చెప్పులు బాగుచేస్తూ జీవించే మార్టిన్ అనేవాడు ఉండేవాడు. ఒక నేలగది వరసలో ఒక చిన్నగది అతడు పుచ్చుగున్నాడు. దానికి కిటికీ ఒకటేగాని అది వీధిమీదికి ఉంది. ఆ కిటికీలోంచి మట్టంగాచూస్తే దారిపోయేవాళ్ళ పాదాలు మాత్రం కనపడగలవు. కాని, బూట్లని బట్టి మార్టిను జనాన్ని పోల్చేసుగునేవాడు. అత డక్కడ చిరకాలంగా ఉంటోచ్చాడూ, పైగా అతనికి అనేకులు పరిచయులు. ఒకసారో రెండుసార్లో అతని చేతిమీదుగా వెళ్ళని బూట్సుజోడు ఆ ప్రాంతంలో లేనే లేదేమో అని చెప్పాలి. అందుకని, కిటికీలోంచి అతడు తరుచుగా తన స్వంత చేతి పనితనమే చూస్తూండేవాడు. కొన్నింటికి అడుగు అట్టలు తీసేసి తాజావి వేశాడు, కొన్నింటి చిల్లులికి మాసిగలు వేశాడు. కొన్నింటి పిగిలిపోయిన కుట్లు మోకాటి దాకా మళ్ళీ కుట్టాడు. కొన్నింటి పైఅట్టలు తీసేసి కొత్తవి వెయ్యడం అనేదికుడా నిర్వహించాడు. అతనికి బోలెడు పని ఉండేది. ఎందు చేతంటే, పనిమీద కూచోగలడు, మంచి సరుకు వాడేవాడు, దారుణపు ఛార్జి కోరేవాడుకాడు, సమ్మతగ్గ మనిషే అనిపించుగున్నాడు. అవతల వారు కోరిన రోజుకి తను పని పూర్తిచెయ్యగలను అనుకుంటేనే ఆ పని అచ్చుగునేవాడు. లేకపోతే, యథార్థం చెప్పేసేవాడు, అంతేకాని దగా వాగ్దానాలు ఎన్నడూ చేసేవాడుకాడు. అందుకని అతడు బాగా పేరు

మోశాడు, పని కొలత అనేది అతడు ఎరగనే ఎరగడు. మార్టిను ఎల్లప్పుడూ మంచి మనిషే. కాని వార్ధకదశలో తన ఆత్మగురించి మరీ ఆలోచించడం, దేవుడికేసి యింకా జరగడం మొదలెట్టాడు. వెనక, తనొక యజమానికి సేవకుడుగా ఉంటూ ఇంకా స్వంత బాధ్యత మీదే పని నడుపుగోనప్పుడు, అతడి భార్య పోయింది, మూడేళ్ళ కొడుకు నొకణ్ణి అతనికి అప్పగించి. మార్టినుకి ఆ పిల్లాడి పూర్వం కలిగిన సంతానం ఎవరూ అక్కరకి రాలేదు. వాళ్ళు పసితనంలోనే భంగపరిచారు. పల్లెటి ప్రాంతంలో ఉన్న తన సోదరి యింటికి ఆ పిల్లాణ్ణి పంపించెయ్యాలని మార్టిను మొదట అభిప్రాయపడ్డాడు. కాని వాణ్ణివిడిచి ఉండడం అనేబాధ తక్షణమే అనిపించగా, 'నా చిన్నిబిడ్డ పరాయి కుటుంబంలో పెరిగి పెద్దవాడవడానికి ఏం పాట్లు పడాలో! పోనీ, నేను వీణ్ణి నా దగ్గిరే పెట్టుగుంటాను,' అనుకున్నాడు.

యజమాని దగ్గిర సేవ మానేసెయ్యగానే కొడుకుతో సహా అతడు ఆ గదిలో ఉంటున్నాడు. కాని, అతడు సంతాన భాగ్యం పెట్టి పుట్టలేదు. పోనీ పాపం, ఆ అబ్బాయి ఎదిగి చేతికి అందొచ్చాడు, ముసిలతనికి ఆసరా అయి అతణ్ని సంతోషపెడతాడు— అని నలుగురూ అనుకునే వయస్సు ఇల్లా వచ్చిందో లేదో ఆ మట్టున ఆ అబ్బాయి జబ్బుపడి ఓ వారం రోజులు పెప్పున జ్వరంకాసి, చచ్చిపోయాడు. మార్టిను కొడుకుని మట్టిచేశాడు. దాన్తో అతడు నిరాశకి లొంగిపోయాడు. ఆ నిరాశ ఎంత గొప్పదీ ఎంత మింగేసేరకం అనగా, అతడు ఆ దెబ్బతో దేవుణ్ని గురించి కూడా సణుగుడు మొదలెట్టాడు, తనంత మసిబి ముఖానికి

ఆయువుపోసి తను ఎంతో ప్రేమించే తన ఏకైక పుత్రుణ్ణి వేసుగుపోయిన దేవుణ్ని నిందిస్తూ, ఖిక్కలిగా దుఃఖిస్తూ, తనకి మరణంరావాలని పదే పదే ప్రార్థిస్తూ అతడు ఉన్నాడు. అప్పుట్నుంచిమార్టిను దేవాలయానికి వెళ్ళడం మానేశాడు.

ఒకనాడు మార్టిను యొక్క స్వగ్రామానికి చెందిన ఒక ముసిలాయన, క్రితంఎనిమిదేళ్ళుగా యాత్రలు చేసుగుంటూ 'త్రోయిచా' మఠంనించి మార్గవశాత్తూ వచ్చి ఇతణ్ని చూశాడు. మార్టిను ఆయనకి తన మనస్సిచ్చి, ఆయనతో తన దుఃఖం వెళ్ళబోసుగున్నాడు. 'ఇక మరి నాకు జీవించాలనే కోరికలేదు. నేను దేవుణ్ణి ఎంత అడిగినా నాకు సత్వరంగా మరణం ఇమ్మనే! ఈ ప్రపంచంలో నాకు ఆశ లేశమైనా లేకుండా పోయింది' అన్నాడు. అందుకు సమాధానంగా ఆ ముసిలి యాత్రికుడు, 'అల్లాంటి విషయాలు మాట్టాడ్డానికి నీకు అధికారం లేదు, మార్టిన్! దేవుడి పద్ధతులమీద మనం తీర్పు చెప్పలేం. మన బుద్ధిని బట్టికాదు, దేవుడి ఇచ్ఛనిబట్టి, దేనికేనా తుదినిర్ణయం. నీ పుత్రుడు మరణించాలనీ నువ్వు జీవించే ఉండాలనీ దైవేచ్ఛ అయుంటే, అట్లా ఉత్తమోత్తమంగా, జరిగి తీరాలి. ఇక నువ్వు నీ నిరాశ అంటున్నావే—అది ఎందుకు బయల్దేరిం దంటే, నీ స్వసౌఖ్యంకోసం నువ్వు జీవించకోరుతున్నాగనక, అన్నాడు. 'మరెందు కోసం మనిషి జీవించడం?' అని మార్టిను ప్రశ్నించాడు. ఆ ముసిలి యాత్రికుడు 'దేవుడికోసం, మార్టిన్! దేవుడు నీకు ప్రాణంపోశాడు, కాబట్టి నువ్వు ఆయనకోసం జీవించాలి. ఆయనకోసం జీవించడం అనేది నీకు బోధపడగానే, నువ్వు

మరి దుఃఖపడవు. అంతాకుడా నీకు సుఖవై పోతుంది,' అని చెప్పాడు. మార్టిను ఒక్క క్షణం ఊరుకుని, మళ్ళీ, 'కాని, మనిషి దేవుడికోసం బతగడం ఏ రీతిగా?' అని కనుక్కున్నాడు. అందుకు బదులిస్తూ ముసిలి యాత్రికుడు, 'మనిషి దేవుడికోసం ఏ రీతిగా బతగాలో క్రీస్తువల్ల మనికి తెలియబడింది. నీకు చదువు వచ్చునా? అయితే, సువార్తల పుస్తకంకొని, అవి చదువు. నువ్వు ఎల్లా జీవించాలని దేవుడికోరికో నీకు తెలుస్తుంది. అదంతా అందులో ఉంది,' అని చెప్పాడు.

ఈ మాటలు మార్టిను హృదయాంతరాళం కంటా దిగడం వల్ల, అతడు ఆరోజునే వెళ్ళి పెద్దఅచ్చులో ఉన్న ఒక నిబంధన పుస్తకం కొని, చదవడం మొదలెట్టాడు. మొట్టమొదట, అతడు సెలవురోజుల్లో మాత్రమే చదువుకుందాం అనుకున్నాడు. కాని, మొదలుపెట్టడం జరిగిం తరవాత, తన హృదయభారం తగ్గిపోతూన్నట్టు అతనికి తోచి, ప్రతిరోజూ చదివాడు. ఒకొక్కప్పుడు అతడు తన చదువులో ఎంతగా లీనం అయుండేవాడంటే, తన పుస్తకాన్నించి తను ఊడి ఇవతలపడే లోపుగానే దీపంలో చమురు అఖరైపోయేది. ప్రతిరాత్రీ చదవడం సాగించాడు. ఇంకా చదివినకొద్దీ ఇంకా పండాల్చినట్టు అతనికి బోధపడింది. తను ఎం జెయ్యాలనీ దేవుడి కోరికో, తను దేవుడికోసం బతగడం ఏరీతిగానో, అంతకంటే అంతకంటే అతని హృదయం తేలికపడుతోచ్చింది. పూర్వంలో తను పరుండడానికి వెళ్ళేటప్పుడు కుంగిపోయిన హృదయంతో తన చిన్నకొడుకుని తల్చుగుని మూలుక్కుంటూ ఏడ్చేవాడు. కాని, ఇప్పుడు మళ్ళీమళ్ళీ

"వైభవం నీకే! వైభవం నీకే! ఓ ప్రభూ! నీ ఇచ్ఛ చేయింపించు" అనుకుంటూ ఉంటాడు. అప్పట్నించి మార్టిను జీవితం యావత్తూ మారిపోయింది. వెనక, సెలవుదినాల్లో అతడు హోటలికి పోయి ఏ 'టీ' యేనా తాగుతూండేవాడు, ఒకటి రెండు గ్లాసుల మద్యంకుడా వద్దనలేకపోయేవాడు. అందుకని ఒక్కొకప్పుడు ఏ స్నేహితుడి తోటో కలిసి ఓ చుక్కవేసుగుని, హోటల్లోంచి తప్పతాగికాకపోయినా మామూలుకంటె హుషారుగా వస్తూ బద్ధితక్కువగా పేలేవాడు—ఎవణ్ణేనా కేకెయ్యడం, లేకపోతే తిట్టడం. ఇప్పుడు ఆ రకం వ్యవహారమంతా అతణ్ణి వదిలేసి పోయింది. అతని జీవితం ప్రశాంతమూ ఉత్సాహకరమూ అయింది. అతడు పొద్దున్నే పనిలో కూచుని రోజుపని పూర్తి కాగానే, గోడనించి లాంపుతీసి బల్లమీద పెట్టి అలమారలోంచి పుస్తకం తెచ్చి, తెరిచి, చదవడానికి కూచునేవాడు. అతడు ఇంకా చదవగా ఇంకా తెలుసుగున్నాడు, అతని మనసు ఇంకా తెరపిని పడి ఇంకా సుఖంగా ఉంది.

ఒకనాటి రాత్రి మార్టిను చాలా పొద్దోయిందాకా చదవడంలో మగ్నుడై కూచున్నాడు. అప్పుడతడు లూకా సువార్త చదువుతున్నాడు: 'ఒక చెంపమీద నిన్ను కొట్టిన వాడికి రెండవది కుడా ఇయ్యచూపు. నీ అంగీ తీసుకుపోయేవాడికి నీ కోటుకుడా ఇచ్చేయకుండా ఉండకు. నిన్నడిగే ప్రతిమనిషికీ ఇయ్యి. నీ వస్తువులు నీ దగ్గిర్నించి తీసేసుగున్న మనిషిని అవి ఇచ్చేసెయ్యని అడగకు. మరి, మనుషులు మీ గురించి ఏమి చెయ్యాలని మీకు ఉంటుందో, మీరు కుడా ఆ ప్రకారం వాళ్ళనిగురించి,'

చెయ్యండి.' అని. తరవాత, మన ప్రభువు ఈ కింది సంగతులు చెప్పిన ఘట్టంలోని వచనాలు కుడా అతడు చదివాడు: ప్రభూ ప్రభూ అని నన్ను మీరెందుకు పిలుస్తూండడం, నేను చెప్పినవి చెయ్యనప్పుడూ? ఎవడేనా నా దగ్గిరికి వచ్చి, నేను చెప్పేవి విని, వాటిని ఆచరిస్తే వాడెల్లాంటి వాడో నిదర్శనం ఇస్తాను. ఇల్లు కట్టడానికి లోతుగా తవ్వి అక్కడ రాతిపునాదివేసే మనిషిలాంటి వాడు వాడు. అప్పుడు వరదతో పొంగి ప్రవాహం మిక్కిలి తీవ్రంగా వచ్చి ఆ యింటిని కొట్టింది. కాని, ఆయింటిని కదిలించలేకపోయింది. ఏమంటే, అది రాతిపునాది మీద కట్టడం వల్ల, కాని, చెప్పేవి విని వాటిని ఆచరించనివాడు, పునాది లేకుండానే నేలమీద ఇల్లుకట్టే మనిషిలాంటివాడు. దానిని బహు తీవ్రంగా ప్రవాహం వచ్చి తట్టగా, తక్షణం అది కూలింది. ఆయింటి నాశనం ఇంతా అంతాకాదు.'—అని.

మార్టిను ఈ మాటలు చదువుకున్నప్పుడు అతని అంతరాత్మ ఆనందించింది. అతడు తన కళ్ళజోడు తీసేసి, పుస్తకంమీద పెట్టి, మోచేతులు బల్లమీద ఆని తను చదివిన వృత్తాంతం మననం చేశాడు. ఆమాటల్లో ఉన్న ప్రమాణంతో తన జీవితాన్ని తనని తనే ప్రశ్నించుగుంటూ తణిఖీచేశాడు. 'నాయిల్లు రాతిపునాదిమీద కట్టానా, నేలమీదా? రాతిపునాదిమీద ఉంటే మంచిదేమరీ. ఒంటరిగా ఇక్కడ కూచుంటూ దేవుడి ఆజ్ఞలన్నీ ఆచరించేశాను అనుకోడం చాలా తేలిక వ్యాపారంగానే కనబడుతుంది. కాని, కాపుదలమీద ఉండడం మానేసిన తక్షణం, పాపంలో ...కి పోతాను, అయినాసరే, నిరంతరంగా యత్నిస్తాను. ఇది నాకు

ఎంతో ఆనందం తెస్తోంది. నాకు సాయపడు, ఓ ప్రభూ !' అను కున్నాడు.

ఇదంతా ఆలోచిస్తూ మరి పడుకోడానికి అతడు సిద్ధపడ్డాడు గాని, పుస్తకం మూసెయ్యడం అతనికి మనస్కరించలేదు. అందుచేత అతడు ఆ యేదో అధ్యాయం చదువుకుంటూ పోయాడు. శతాధిపతి, విధవరాలి కుమారుడు, యోహాను శిష్యుల కిచ్చిన సమాధానం, గురించి చదివేసిన తరవాత ధనిక పరి సయ్యుడు ప్రభువును తనయింటికి భోజనానికి పిల్చిన భాగం దగ్గిరికి వచ్చి, అక్కడ ఎట్లా ఒక పాపాత్మురాలైన స్త్రీ తన కన్నీళ్ళతో ఆయన పాదాలు కడిగి వాటికి అత్తరుపూసిందో, ఎట్లా ఆయన ఆమెను సమర్థించాడో చదివి, నలభైనాలుగో వచనం దగ్గిర్కొంచి, 'అప్పుడాయన తన మెడతిప్పి ఆ స్త్రీని సూచించి, సీమోనుతో, 'సీమోనూ ! చూస్తున్నావా ఈ స్త్రీని ? నేను నీ యింటిలోకి వచ్చినా నా పాదాలు కడుక్కోడానికి నువ్వు నీళ్ళియ్యలేదు. కాని యీామె నేనున్నచోటికి తనేవచ్చి నా పాదాలు తనే కడగడానికి తనే కన్నీళ్ళు తెచ్చుగుంది. నువ్వు నా నుదురు ముద్దుపెట్టుగుని ఉండలేదు. కాని, యీామె నేను లోపలికి వచ్చిన క్షణంనించీ నా పాదాలు ముద్దుపెట్టుగోడం మానలేదు. నువ్వు నాతల తైలంతో అంటలేదు. కాని, యీామె నా పాదాలు అత్తరుపుతో అంటింది.' అంటూ ఉన్న వచనాలు చదివి, తనలో, 'వాడు పాదాలు కడుక్కోడానికి నీళ్ళియ్యలేదు, ముద్దుపెట్టుకోలేదు, తైలంతో ఆయన తల అంటలేదు....' అనుకుని, సులోచనాలజోడు మళ్ళీ తీసేసి, పుస్తకంమీద పెట్టేసి,

మళ్ళీ మననంలో పడి, 'వా డెవడో నాలాంటి వాడే, ఆ పరిసయ్యుడు. తననిగురించి మాత్రమే ఆలోచించు గున్నాడు వాడు కుడా—ఓ కప్పు 'టీ' ఎట్లా దొరుకుతుందా, వెచ్చగానూ సుఖంగానూ ఎట్లా ఉండడమూ, అనుకుంటూ, అంతేగాని అతిథిని గురించి ఆలోచించనేలేదు. తన జాగ్రత్త తను పడ్డాడు, అతిథిని గురించిన జాగ్రత్త ఎంత మాత్రమూ పడలేదు. అందులో మళ్ళీ ఎవరు ఆ అతిథి? కేవలం ఆ ప్రభువే! ఆ ప్రభువు నా యింటికే వస్తే, ఈ మోస్తరుగానా నేను ప్రవర్తించవలిసిందీ?' అనుకుని, తన రెండు బాహువులమీదా తలమోపి, అనుకోకుండానే గాఢంగా నిద్రపోయాడు, 'మార్టిన్' అనే కంఠస్వరం అతడు అకస్మికంగా విన్నాడు—తన చెవికి పైన ఎవరో ఉండి. వారి నిశ్వాసలో ఆ మాట కొట్టుగువస్తే విన్నట్టు! అతడు హడిలిపడి లేచి 'ఎవరక్కడ?' అన్నాడు. వెనక్కి తిరిగి అతడు తలుపుకేసి చూశాడు. అక్కడ ఎవడూలేడు. మళ్ళీ కేకేశాడు. అప్పుడు మిక్కిలి స్పష్టంగా 'మార్టిన్! మార్టిన్! రేపు వీథులోకి బాగా చూడు, ఏమంటే నేను వస్తాను' అని అతనికి వినిపించింది, మార్టిను పూర్తిగా మేలుకున్నాడు. కుర్చీలోంచి లేచాడు, కళ్ళు రాసుగున్నాడు, కాని ఈ మాటలు తను కలలో విన్నాడో మెలుకువలో విన్నాడో తెలుసుగో లేకపోయాడు. అతడు లాంపు ఆర్పేసి పడుకుని నిద్రపోయాడు.

మర్నాడు పొద్దున్న తెల్లవారకుండానే అతడు లేచి, ప్రార్థనలు కానిచ్చుగుని, నిప్పుచేసి, కాబేజీపులుసూ, గోధుమజావా తయారుచేసుగున్నాడు. తరవాత 'టీ' కాగులోనిప్పేసి, తన

తుడుపుగుడ్డ కట్టుగుని, కిటికీ దగ్గిర పనిలో కూచున్నాడు. పని చేసుగుంటూ క్రితం రాత్రి జరిగించాన్ని గురించి, అతడు తల పోశాడు. ఒకొక్కప్పుడు జరిగింది యావత్తూ అతనికి కల అనిపించేది, మళ్ళీ ఒకొక్కప్పుడు తను ఒక కంఠధ్వని వినుండడం యథార్థమే అని తోచేది. 'ఇంతకి పూర్వంకుడా ఇలాంటివి జరిగాయి,' అని అతడనుకున్నాడు. అందుకని, అతడు కిటికీ దగ్గిర కూచుని, పని చూసుగోడం కంటె ఎక్కువగా వీధులోకి చూడడమే మొదలెట్టి, తనకి పరిచయంలేని బూట్సు తొడుక్కుని ఎవడేనా ఆవీధిని వెళ్ళడం తటస్థిస్తే, వాడి పాదాలు మాత్రమే కాక వాడి మొహంకుడా తనికి కనపడేటట్టు, కిటికీ అడుగు కమ్మి దాకా వంగి దృష్టి పైకెత్తి చూసేవాడు. కొత్త వూళల్లిక బూట్సు తొడుక్కుని ఒక ఇంటికూలివాడు దాటివెళ్ళాడు. తరవాత ఒక నీళ్ళమోతకూలివాడు వెళ్ళాడు. అప్పుడే ఒక ముసిలి సిపాయి—పూర్వరాజు కాలంవాడు—ఒకపార చేత్తోపట్టుగుని, కిటికీ దగ్గిరికి వచ్చాడు. అతడి బూట్సుచూసే అతణ్ణి పోల్చుగున్నాడు మార్టిను. అవి వూలల్లికవి, తుక్కైపోతే చర్మంఅట్ట వేశారు. ఆ ముసిలి వాడిపేరు స్టైపానీ. ఒక ఇరుగుపొరుగు వర్తకుడు అతణ్ణి ఉత్తపుణ్యానికి తన 'యింట్లో అట్టేపెట్టుగున్నాడు. అతని పని ఏమిటంటే, ఇంటికూలి చేసేవాడికి సాయం చెయ్యడం. అతడు వచ్చి మార్టిను కిటికీ ముందున్న మంచుబెడ్డలు తుడిచెయ్యడం మొదలు పెట్టాడు. మార్టిను అతడికేసి ఒక్కసారి చూసి, తరవాత తనపనిలో పడ్డాడు. 'ముసిలితనం ముదిరి క్రమేపీ నాకిప్పుడు పిచ్చెత్తింది గావును. అందుకనే, ఎరుగున్న స్టైపానీ మంచు తుడవడానికి వచ్చినా, అతడికేసిచూస్తూ, నన్ను చూడ్డానికి క్రీస్తే

వచ్చాడని రూఢిగా ఊహిస్తున్నాను గావును! ఎంత పిచ్చి వృద్ధుణ్ణిగా తయారయానూ!' అంటూ అతడు తనకి కలిగిన పిచ్చి భ్రమకి తనే నవ్వుకున్నాడు. కాని, అతడు ఒక డజను సూదిపోట్లు పొడిచిన తరవాత, మళ్లీ కిటికీలోంచి చూడని ఎవరో లాగినట్టు అతనికి అనిపించింది. అతడు చూడగా, స్టైపానీ తన పార గోడకి జేర్లేశాడు, శ్రమ బాధపడలేకో చలి బాధ ఓర్వలేకో! ఏముంది పాపం, ముసిలితనం, శక్తి ఉడిగి పోయింది. మంచు చిమ్మేసేపాటి బలమేనా అతడికి లేదని స్పష్టంగా తెలిసిపోతోంది. 'పోనీ, ఇతణ్ణి నేను లోపలికి పిల్చి, కొంచెం 'టీ' ఇస్తే! 'టీ' కాగు అప్పుడే ఉడుకట్టింది గనక!' అనుకున్నాడు మారిను. అతడు తన ఆరే యథాస్థానంలో గుచ్చేసి, లేచాడు. 'టీ' కాగు బల్లమీదపెట్టి, టీ చేశాడు. తరవాత కిటికీ మీద వేళ్ళతో తాటించాడు. స్టైపానీ అది గమనించి, కిటికీ దగ్గిరికి వచ్చాడు. లోపలికి రమ్మని అతడికి సంజ్ఞచేసి మార్టిను తనే వెళ్ళి తలుపుతీశాడు. 'లోపలికి రా. వచ్చి కొంచెం చలి కాచుగో. నీకు చాలా చలెత్తిపోయిం దనుకుంటాను' అన్నాడు. స్టైపానీ, 'దేవుడు మీకు ధన్యత చేకూర్చాలి. నిజంగా నా ఎముకలు పొడుం అయిపోయాయి' అన్నాడు. అతడు తన మీద రాలిన మంచు దులిపేసి, మరీ ప్రవేశించాడు లోపల. పైగా, నేలమీద మరకలు పడతాయేమో అనే భయంచొప్పున పాదాలు కుడా తుడిచేసుగోవాలని యత్నించడంలో తూలి పడి పోతాడా అన్నంత పని జరిగింది. మార్టిను, 'అక్కర్లేదు, అక్కర్లేదు. పాదాలు తుడిచేసుగోవా లంటూ బాధపడకు. నేను

తుడిచేస్తానుగా నేలా? అదంతా నాకు నిత్యకృత్యంలో ఉండేదే! రా, నేస్తం! కూచుని కొంచెం టీ పుచ్చుగో!' అన్నాడు. అని, అతడు రెండు గ్లాసులనిండా టీ పోసి, ఒక గ్లాసు అతిథికి అందించి, రెండోది తను పుచ్చుగుని అందులోది సాసర్లో పోసుగుని ఊదుకోడం మొదలెట్టాడు. స్టెపానీ తన గ్లాసు ఖాళీచేసేసి బల్ల మీద బోర్లించి మిగిలిపోయిన పంచదార దానిమీదపెట్టి, తన కృతజ్ఞత తెలియపరచడం మొదలెట్టాడుగాని మరికొంచెం ఇస్తే సంతోషిస్తా నన్నట్టు అతని ధోరణిబట్టి తెలుస్తోంది. తక్షణం మార్టిను అతిథిగ్లాసూ తనగ్లాసూ కుడా నింపుతూ, 'మరో గ్లాసు పుచ్చుగో, నేస్తం!' అన్నాడు. కాని, తను తన గ్లాసులోంచి టీ పీలుస్తూ మార్టిను వీధులోకి దృష్టి పెట్టుగునే ఉన్నాడు. అతిథి, 'ఎవరి కోసమేనా చూస్తున్నారా' అని అడిగాడు. మార్టిను, 'ఎవరికోసమేనా చూస్తున్నారా అంటావా? అల్లాంటిదే అల్లాంటిదే. కాని, నీతో చెప్పడానికి సిగ్గుగాఉంది. ఎవరేనా వస్తారని నేను నిజంగా ఆశిస్తున్నాను అనడానికీ లేదు మళ్లీ! నిన్న రాత్రి నేను కొంత ఏదో విన్నాను. అది మరిచిపోలేకుండా ఉన్నాను. అది ఏదేనా దివ్యదర్శనమో, లేక ఇంతాచేసి నా పిచ్చి భ్రమో, నేను చెప్పలేను. చూశావు, నేస్తం! నిన్నరాత్రి నేను సువార్త చదువుతూ క్రీస్తుప్రభువు ఎల్లా బాధపడ్డాడో భూమిమీద ఎల్లా నడుచుగునేవాడో గమనించాను. అదంతా నువ్వు ఎక్కడేనా చెప్పగా వినుంటావు, అనుకుంటాను,' అన్నాడు. స్టెపానీ, 'మరే. ఎక్కడో చెప్పగా విన్నాను. నేను అజ్ఞానిని, నాకు చదవడం రాదు,' అన్నాడు. మార్టిను, 'ఇదుగో, చూడూ,

అతడు భూమిమీద ఎల్లా నడుచుగునేవాడో చదివేస్తూ ఉన్నాను. ఆ ఘట్టంలోకి వచ్చాను—ఏది?—తిన్నగా అతిథ్యం ఇయ్యని పరిసయ్యు డింటికి ఆయన వెళ్ళాడే!—అది, ఆ మట్టున, నేను. అది చదవగానే, ఏమిరా క్రీస్తుప్రభువుకి అర్హ గౌరవంతో ఈ మనిషి అతిథ్యం ఇయ్యకుండా ఎట్లా ఊరుకున్నాడో అను కుంటూ ఆలోచించుగున్నాను. మరేమిటంటే, అటువంటి సందర్భమే నా బోటి వాడికి తటస్థిస్తే, ఆయనకి అతిథ్యం ఇయ్యడానికి నేను ఏమి చేసుండను గనకా! అని కూడా అనుకున్నాను. కాని, ఆ మనిషి ఆయనకి అతిథ్యం ఇయ్యనే లేదు. సరే, నేస్తం. అల్లా అనుకుంటూ నేను నిద్దరతో తూగి పోయాను. అప్పుడు ఎవరో నన్ను పేరెట్టి పిల్చారు. లేచాను, 'నా కోసం ఎదురు చూస్తూండు. రేపు నేను వస్తాను' అనే మాటలు గుసగుసగా నాకు వినిపించాయని నేను అనుకున్నాను. ఇల్లా రెండుసార్లు అయింది. నీతో నిజం చెప్పేస్తున్నాను, ఆ సంఘటన నా మనసులో ఎంత పాతుకు పోయిందంటే—చెప్పడం సిగ్గుచేటని నాకే అనిపిస్తూన్నా—నేను ఆ ప్రియ ప్రభువు రాక ఇప్పుడు కూడాఎదురుచూస్తూ ఉన్నాను!' అన్నాడు. స్టెపానీ మౌనంగానే తల వంకిస్తూ, తన గ్లాసు ఖాళీచేసి, దాన్ని వాల్చి పెట్టాడు. కాని, మార్టిను దాన్ని నిలువుగాపెట్టి దాన్నిండా టీ మళ్లీపోశాడు. 'చూడూ, మరొక్క గ్లాసు పుచ్చుగో, నీకు పుణ్యం ఉంటుంది. అప్పుడు నేనింకా ఏమి ఆలోచిస్తున్నా నంటే, ఆయన భూమిమీద ఎల్లా నడుచు గున్నాడో, ఎవర్నీ ద్వేషించ కుండా ఎల్లా ఉన్నాడో, సాధారణజనంమధ్యకే

ముఖ్యంగా ఎల్లా వెడుతూండే వాడో—అదంతా! ఆయన సాదా జనంతోనే సహవసించాడు, మనం పాపులం అయినా, మన బోటి పాతక జనంలోంచే ఆయన తన శిష్యుల్ని ఎన్నుకుంటూ! ఆయన: తను తననే ఘనపరుచుగునేవాడు నమ్రుడుగా చెయ్య బడతాడు, కాని తను తననే నమ్రపరుచుగునేవాడు ఘనపరచ బడతాడు అన్నాడు. నువ్వు నన్ను ప్రభువా అని పిలు, నేను నీ పాపాలు కడుగుతాను, అన్నాడు. ఎవడేనా ప్ర ప్రథముడు అవాలంటే సర్వజన సేవకుడవాలి, అన్నాడు. ఎందుచేత అంటే, దరిద్రులు, నమ్రులు, దీనులు, దయాపరులు—వీళ్ళే ధన్యులు, అన్నాడు, అని మార్టిను చెప్పాడు. స్టెపానీ టీ మాటే మరిచి పోయాడు. ముసిలివాడికి కన్నీళ్ళు త్వరగా వచ్చేస్తాయి. అతడు కూచుని వింటూండగా చెంపలమీద నించి కన్నీళ్ళు తెగ కారి పోయాయి. మార్టిను, 'చూడూ, మరి కొంచెం తాగు,' అన్నాడు. కాని స్టెపానీ క్షేమశిలువ అభినయించి, అతనికి వందనంచేసి, గ్లాసు పక్కగా పెట్టి, లేచాడు. 'చాలా కృతజ్ఞుణ్ణి. మార్టిన్! నా ఆత్మకీ నా శరీరానికీకూడా ఆహారమూ స్వస్తతా కూడా చేకూర్చావు' అన్నాడు. అని, అతడు వెళ్ళిపోయాడు.

మార్టిను మిగతా టీ పోసుగుని, తాగేశాడు. తరవాత ఆ టీ పరికరాలు యథాస్థానాల్లో పెట్టేసి, పనిలో కూర్చున్నాడు—ఒక బూటు వెనకతట్టు నిలువుకుట్టు కుట్టడానికి. అతడు కుడుతూన్నా క్రీస్తుకోసం ఎదురుచూస్తూ, ఆయన్ని గురించీ ఆయన పన్లగురించీ యోచిస్తూ కిటికీలోంచి బయటికి చూస్తూనే ఉన్నాడు. క్రీస్తుపలికిన వాక్యాలతో అతని తల నిండిపోయింది.

ఇద్దరు సిపాయిలు వెళ్ళారు—ఒకడు ప్రభుత్వం బూట్సు తొడుక్కున్నాడు, రెండోవాడు స్వంతానివే. తరవాత ఒక పక్కింటి యజమాని తళతళా మెరిసే చెప్పులతో వెళ్లాడు. ఆ తరవాత గంప పట్టుగుని ఒక రొట్టెలవాడు వెళ్ళాడు. వీళ్ళంతా దాటి పోయాక, తుక్కురేగిన కాలి తొడుగులూ మట్టల చెప్పులూ తొడుక్కుని ఒక స్త్రీ వచ్చి, కిటికీ దాటిందిగాని, ఆ గోడ దగ్గిర ఆగింది. మార్టిను కిటికీలోవంగి దృష్టియెత్తి ఆమెని చూశాడు. ఆమె పరాయిమనిషి, ఆమె వేషం దీనంగా ఉంది, ఆమె తన చేతుల్లో ఒక శిశువుని పట్టుగుని ఉంది. ఆమె గోడదగ్గిర ఆగి, తన వీపు చలివైపు పెట్టి, శిశువుకి చలి కొట్టకుండా కమ్ముతోంది. శిశువుకి కప్పడానికి తన దగ్గిర ఏమీ లేకపోయినా. ఆమె యింకా వేసంగి దుస్తుల్లోనే ఉంది, ఆ దుస్తులైనా చీదరగానూ చిరిగి పోయీ ఉన్నాయి. ఆ శిశువు ఏడుపూ, శిశువుని సమదాయించడానికి తల్లిచేసిన యత్నమూ ఆ యత్నంవల్ల లాభం లేకపోవడమూ—అన్నీ మార్టిను కిటికీలోంచి విన్నాడు. అతడు లేచి, తలుపు తీసుగువెళ్ళి మెట్లెక్కి, 'అమ్మాయ్, ఏమమ్మోయ్, తల్లీ!' అని అమెని పిల్చాడు. ఆమె విని తల మార్టినుకేసి తిప్పింది. మార్టిను, 'చంటి బిడ్డతో ఇంత చలిలో బయట అల్లా నుంచుండి పోయావేం అమ్మా! లోపలికిరా. ఇంతకంటె బాగా కప్పవచ్చు బిడ్డకి, వెచ్చటిచోట. ఈ దార్ని, రా' అన్నాడు. కంఠానికి తుడుపుగుడ్డా ముక్కుమీద కళ్ళజోడూ ధరించిన ఒక ముసిలివాడు తనని పిలవడమూ, తన కూడా లోపలికి రమ్మనడమూ ఆ స్త్రీకి ఆశ్చర్యకరంగా ఉంది. మెట్లుదిగి వాళ్ళు ఆ గదిలో

ప్రవేశించారు. ముసిలివాడు ఆ స్త్రీకి ఒక పక్క చూపిస్తూ, 'అదుగో, అక్కడ కూర్చో, అమ్మా. ఆ నిప్పు సెగని, నువ్వు చలికాచుకో, బిడ్డకి పాలియ్యి' అన్నాడు. ఆ స్త్రీ 'ఇయ్యడానికి పాలులేవు. పొద్దుణ్ణించీ నే నేమీ తిన్లేదు,' అందిగాని, అన్నా, బిడ్డని రొమ్ముకి చేర్చుగుంది. మార్టిను, 'ఓహో, అల్లా చెప్పు' అన్నట్టు తల కదిపాడు. వెళ్ళి ఒక మూకుడూ కొంచెం రొట్టీ తెచ్చాడు. పొయ్యి తలుపు తెరిచి, కొంచెం కాబేజి పులుసు మూకుట్లో పోశాడు. జావకుండకుడా బైటికి తీసి చూశాడు. అది యింకా తయారవలేదు. అందుకని, బల్లమీద ఒక బట్ట పరిచి, దానిమీద రొట్టీ పులుసూ మాత్రమే వడ్డించాడు. 'కూర్చుని తిను తల్లీ! బిడ్డని నేను చూస్తూంటాను. అబ్బే, దేవుడు నన్ను కటాక్షించలేదు గాని, నాకూ ఉండే వారమ్మా బిడ్డలు. నేను బిడ్డల్ని ఆడించగల్ను' అని ఆమెతో అన్నాడు. ఆమె శిలువ రక్ష పెట్టుగుని, బల్లదగ్గిర కూచుని తినడం ప్రారంభించింది. మార్టిను ఆ బిడ్డని పక్కమీద పడుకోపెట్టి, తను పక్కని కూచున్నాడు. అతడు ఎంత సేపైనా 'ఉః దుః దుః హోయీ' అనడం సాగించాడుగాని, తనకి పళ్ళులేని కారణంచేత అది బాగా పలక్క కుర్రాడు ఏడుస్తూనే ఉన్నాడు. తరవాత మార్టిను బిడ్డని వేలుతో ఝడిపించడం మొదలెట్టాడు. తనవేలు గభుక్కున బిడ్డనోట్లో పెడుతూన్నట్టు నటించడం, వెంటనే అది వెనక్కి లాక్కుంటూండడం. అల్లా మళ్ళీ మళ్ళీ చేశాడు. అతడు తనవేలు బిడ్డనోట్లోకి మాత్రం వెళ్ళనియ్యలేదు. ఎందుచేత అంటే. అది చెప్పులు బాగుచేసేవాళ్ళ మైనంతో నల్లగావుంది. దాంతో కుర్రాడు

ఏడుపు మానేసి వేలికేసి నిదానించడం మొదలెట్టాడు. తరవాత నవ్వడం ప్రారంభించాడు. మార్టినుకి ఎంతో సంతోషమైంది. ఆ స్త్రీ భోజనంచేస్తూ మాట్లాడుతూ తను ఎవరో ఎక్కడిదో చెప్పగు వచ్చింది :

'నేను ఒకసిపాయికిభార్యని. నాభర్తనిఎక్కడికోదూరంగా,ఎనిమిది నెలల కిందట పంపించారు. ఇంతవరకు ఆయన అతీ గతీ నాకు తెలియదు. ఈ బిడ్డ కలిగేవరకూ నేను వంటలక్కగా పని చేశాను. కాని, బిడ్డతో సహా నేనా పనిలో ఉండడానికి యజమానులు ఒప్పుగోలేదు. ఏదేనా పని దొరుకుతుం దేమో అని మూడు నెల్లనించి గిజ గిజ లాడుతున్నాను. ఈ లోపుగా ఉన్నవన్నీ తిండికోసం అమ్ముకున్నాను. పాలదాదిగా ఎక్కడేనా చేరుదాం అనుకున్నాను గాని, నన్ను చూడడంతోటే ప్రతీవాళ్లూ వద్దనే శారు. నేను తిండిమొహం ఎరగనట్టు పీలగా ఉన్నాను. అనే శారు. ఇప్పుడే ఒక వర్తకుడి భార్యని కలుసుగుని వచ్చాను. ఆవిడ దగ్గిర మావూరి స్త్రీ ఒకతె పనిచేస్తోంది. ఆ ధనికురాలు నాకు పని ఇస్తానని వాగ్దానం చేసింది. ఎట్లాగో చిట్టచివరకి ఏదో ఓటి స్థిరపడింది గదా అని అనుకున్నానుగాని, ఆవిడ నన్ను వచ్చేవారం దాకా రావద్దు అంది. ఆ స్థలం ఇక్కడికి చాలా దూరం, పనితో నేను అరిగి పోయాను, బిడ్డ బొత్తిగా మాడిపోతున్నాడు, అక్కడ జీతం చాలా అల్పం. మా అదృష్టం కొద్దీ మా యింటి యజమానురాలికి మా మీద జాలి. ఆవిడ అద్దె తీసుగోకుండా మాకు బస యిచ్చింది. ఇవ్వకపోతే మేం ఏం జేసే వాళ్ళమో నాకు తెలియదు' అంది.

మార్టిను నిట్టూరుస్తూ 'ఇంతకంటె వెచ్చగాఉండే దుస్తులు నీకు లేవా?' అని ప్రశ్నించాడు. ఆమె, 'వెచ్చగా ఉండే దుస్తులు నా కెల్లా వస్తాయి? చెప్పక పోవటేం, ఒక్క శాలువ ఉంటే ఆ ఒకప పిన్న ఆరణాలకి తాకట్టు పెట్టేశాను,' అంది. అప్పుడామె వెళ్ళి బిడ్డని ఎత్తుగుంది మార్టిను లేచాడు. అతడు వెళ్ళి గోడని వేళ్ళాడుతూండే దుస్తులు కొన్ని ఇటూ అటూ తిరగేసి చూసి. ఒకపాత అంగీ తీసి తెచ్చి, 'ఇదుగో. ఇది వెలిసిపోయిన పాతసరుకే, గాని బిడ్డకి కప్పడానికి పని చేస్తుంది,' అన్నాడు. ఆ స్త్రీ ఆ అంగీకేసి చూసి, ముసిలివానికేసి చూసి, అది పుచ్చుగుని గొల్లున రాగా లెట్టింది. మార్టిను అటు తిరిగి, పక్కకింద తడుములాడి ఒక చిన్న ట్రంకుపెట్టె పైకి తీశాడు. ఆ పెట్టె తెరిచి అందులోనన్నీ కెలికేసి, మళ్ళీవచ్చి ఆ స్త్రీ ఎదర కూచున్నాడు. అప్పుడా స్త్రీ, 'దేవుడు నీకు ధన్యత చేకూర్చాలి, నేస్తం, క్రీస్తు నీ కిటికీ దగ్గిరికి నన్ను పంపించుండాలి. లేకపోతే ఈ బిడ్డ చలికి బిగుసుకు పోయేవాడే, నేను బయల్దేరే టప్పుడు సమశీతలంగానే ఉంది, గాని ఇప్పుడు ఎంత చలిగానేనా మారింది. నీ కిటికీ లోంచి నువ్వు బయటికి చూసేటట్టున్నూ, దీన దరిద్ర నైన నా మీద నువ్వు జాలి కలిగించే టట్టున్నూ, చేసినవాడు క్రీస్తు అయుండి తీరాలి బూఢిగా,' అంది. మార్టిను చిరునవ్వుతో, 'అవి పూర్తిగా నిజం. అట్లా చెయ్యాలని అతడు నాతో చెప్పాడు. నేను బయటికి చూడడం కాకతాళీయంగా కాదు' అన్నాడు. అతడు ఆ స్త్రీతో పని కలా ఆ రోజుని తనని చూడ వస్తానని వాగ్దానం చేసిన ప్రభువు యొక్క కంఠస్వరం తను విన్న రీతి,

చెప్పాడు. ఆ స్త్రీ, 'ఎవ డెరుగును? అన్నీ సంభవ నీయమే,' అని లేచి ఆ అంగీ తన భుజాలమీద వేసుగుని తన చుట్టూరా కప్పుగుని బేబీచుట్టూరా కుడా కప్పింది. ఆమె తలవంచి మరొక సారి మార్టినుకి నమస్కరించింది. మార్టిను, 'క్రీస్తుపేరు చెప్పి ఇది తీసుకో' అంటూ, తాకట్టు శాలువ విడిపించుగోడానికి కావలిసిన ఆరణాల సొమ్మూ ఆమెకి ఇచ్చాడు. ఆమె శిలువ రక్ష పెట్టుగుంది. మార్టిను కుడా శిలువరక్ష పెట్టుగుని, ఆమెను వీధి వరకూ సాగనంపాడు.

ఆ స్త్రీ వెళ్ళిపోగానే, మార్టిను కొంచెం కాబేజీ పులుసు తిని, సామాన్లు ఎక్కడివక్కడ పెట్టేసి. మళ్లీ పనిలో కూర్చున్నాడు. అతడు కూచుని పని చేస్తున్నాడేగాని కిటికీసంగతి మరవలేదు. కిటికీమీద ఏదేనా నీడపడిన ప్రతీసారీ వెళుతూన్నది ఎవరో గమనించడానికీ తక్షణం దృష్టి ఎత్తేవాడు. పరిచితులూ వెళ్లారు. అపరిచితులూ వెళ్ళారు, కాని వాళ్ళల్లో గమనించతగ్గ వాళ్ళు ఒకరూలేరు. కొంత సేపటికి, ఒక రేగుపళ్ళమ్మి తన కిటికీకి కేవలం ఎదట ఆగడం అతడు చూశాడు. ఆ అమ్మి పళ్ళగంప చాలా పెద్దదే కాని అందులో మిగిలున్న పళ్ళుమాత్రం అట్టే ఉన్నట్టు కనపడకపోవడంవల్ల, ఆమె తన సరుకు చాలా మట్టుకు వదిలించుగున్నట్టు తెలిసిపోతోంది. ఆమె భుజంమీద చిదుగులు వేసిన చిన్న సంచీ ఒకటి ఉంది. అది ఆమె తన ఇంటికి తీసుగుపోతోంది. ఎక్కడో ఇళ్లు కడుతూండే చోట ఆమె ఆ చిదుగులు పోల్లుకుంది అనడానికి సందేహిం చక్కర్లేదు. భుజంమీది చిదుగుల బస్తా గుచ్చుగుంటుంధని వేరే చెప్పక్కర్లేదు గనక. ఆమె

దాన్ని ఉన్న భుజంమీంచి మరో భుజం మీదికి పిరాయించ దల్చుకుని, ధాన్ని కాలి దారి మీదే ఒకచోట దింపుగుని పక్క నున్న ఒక దిమ్మమీద గంప ఉంచి, చిదుగులు సమంగా సర్దుకో డానికి బస్తా పట్టుగుని కుదుపుతోంది ఆమె ఆ పనిలో ఉండగా ఒక చిరుగుల టోపీ కుర్రాడు గంపలోంచి ఒక పంటు లాగేసి మెల్లిగా జారిపోడానికి యత్నింస్తూంటే, ఆ అమ్మి అది గమ నించి, వెళ్ళి వాడిచొక్కా చేతి కప్పులు పట్టుగుంది, వాడు గింజు కుని తప్పించుగు పోవాలని చూశాడు గాని రెండు చేతుల్తోటీ పట్టుగుని వాణ్ణాపేసి, టోపీ ఊడేటట్టు ఒఖటికొట్టి వాడిజుట్టు దొరకపుచ్చుగుంది. వాడు కుయ్యో మొర్రో అంటున్నాడు. ఆ అమ్మి కసురుకుంటోంది. మార్టిను తన ఆరే యథాస్థలంలో గుచ్చడానికేనా ఆలస్యం చెయ్యక కింద పారేసి, బయటికి ఎగ బడి, తడబడుతూ మెట్లు గబగబా ఎక్కి అప్పటి తొందరలో కళ్ళజోడు కింద పడిపోగా వీధులోకి పరిగెత్తాడు. ఆ అమ్మి ఆ కుర్రాడి జుట్టుపీకేస్తూ వాణ్ణి తిట్టి పారేస్తోంది. పోలీసులకి అప్పగించేస్తానని బెదిరించేస్తోంది. వాడు గిజ గిజ లాడుతూ ఆ అమ్మికి అన్యాయం ఆరోపిస్తూ 'నే నేమీ తీసుగోందే! ఎందు కల్లా కొడతావు? వదిలెయ్!' అన్నాడు. మార్టిను వాళ్ళని విడ దీసి, కుర్రాడి చెయ్యిపట్టుగుని, ఆ అమ్మితో, 'వీణ్ణి వదిలెయ్, తాతమ్మా! క్రీస్తుపేరుచెప్పి. వీణ్ణి క్షమించు,' అన్నాడు. ఆ అమ్మి, 'ఆ. వీడికి బాగా ముట్టచెబుతా, ఏడాదిలోపల మళ్లీ మరిచిపోకుండా! ఈ భడవని పోలీసులకి అప్పగించేస్తాను' అంది. మార్టిను ఆ ముసలమ్మని బతిమాలు కుంటూ, 'వీణ్ణి వది

లెయ్, తాతమ్మా. ఆ పని మళ్ళీ చెయ్యడులే. క్రీస్తుపేరు చెప్పి, వీణ్ణి క్షమించు,' అన్నాడు. ముసలమ్మ వాణ్ణి వదిలేసింది. వాడు తక్షణం పారిపోవాలని చూశాడుగాని మార్టిను వాణ్ణి ఆపేశాడు, 'ఈ తాతమ్మని క్షమాపణ కోరుకో. ఇంకెప్పుడూ ఇల్లాంటి పని చెయ్యకు. నువ్వు రేగుపండు తీసేసుగోడం నేను చూశాను,' అన్నాడు. ఆ కుర్రాడు ఏడుపు ప్రారంభించి క్షమాపణ కోరు కోడం మొదలెట్టాడు. మార్టిను 'ఇదీ ధర్మం. ఇదుగో ఇందుకు ఈ రేగుపండు పుచ్చుగో,' అంటూ గంపలోంచి ఒకటి తీసి ఆ కుర్రాడి కిస్తూ, 'ఖరీదు నే నిస్తాను తాతమ్మా!' అన్నాడు. ఆ ముసలమ్మ, 'ఇల్లా చేస్తే పాడై పోతారు ఈ కుర్రకుంకలు. ఒక వారమేనా జ్ఞాపకం ఉండేలాగ వీణ్ణి కొరడాతో ఉతగాలి అసలు,' అంది. మార్టిను. 'అయ్యో, తాతమ్మ! తాతమ్మ! అదిమన పద్ధతికాని, అది దేవుడి పద్ధతికాదు. రేగుపండు తస్కరించినందుకు వీణ్ణి కొరడాతో బాదవలిసుంటే, మన పాపాలకి మన్ని ఏంచెయ్య వలిసుంటుందీ?' అన్నాడు. ముసలమ్మ మాట్లాడలేక పోయింది. అప్పుడు మార్టిను ఆ అమ్మికి ఆ తత్వకథ చెప్పాడు: యజమాని తన సేవకు డియ్యవలిసిన పెద్ద ఋణం చెల్లించ చక్కర్లేదని క్షమించగా, తక్షణం వా డెళ్ళి కాస్త తనకి బాకీ ఉన్నవాడి గొంతుక పట్టుగున్నా డనే సంగతులు గలది. ఆ కథ చివరంటా శ్రద్ధగా ఆ ముసలమ్మా వింది, ఆ కుర్రాడూ విన్నాడు, మార్టిను, 'క్షమిం చండి. క్షమించకపోతే క్షమింపబడరు — అని దేవుడి ఆజ్ఞ. ప్రతి వాణ్ణీ క్షమించెయ్యాలి, అందులో ముఖ్యంగా ఏమీ ఎరగని కుర్రాణ్ణీ' అన్నాడు. ముసలమ్మ తల పంకిరిస్తూ నిట్టూర్పుపుచ్చి,

'నిజమే, ఎంతైనా నిజం కాని ఇలాంటివాళ్ళు బొత్తిగా పాడై పోతున్నారు.' అంది. అందుకు సమాధానంగా మూర్తిను, 'అటువంటప్పుడు ముసలివాళ్ళం వాళ్ళకి అంతకంటె సుష్టుగా ఉండే మార్గం చూపించాలి.' అన్నాడు. ఆముసలమ్మ, 'అదే, అచ్చంగా నేననే మాటాను. నేనూ ఏడుగుర్ని కన్నాను, నాయనా: ఇప్పుడు ఒక్ఖ కూతురు మాత్రం ఉంది.' అంటూ తను ఏ రీతిగా ఎక్కడ తన కూతు ర్నెట్టుగుని ఉంటుందో, తన కెంతమంది మనమలో మనమరాళ్ళో అవంతా చెప్పుగొచ్చి, 'మరి, చూడు, బాబూ! నాకు ఒంట్లో బొత్తిగా సత్తువలేదు, లేకపోతేం గనక, నా మనమసంతతి కోసం కష్టపడి పనిచేస్తూనే ఉన్నాను. పాపం వాళ్ళంతా ఎంతో ఇదైనవాళ్ళు కుడానూ. నా దగ్గిరికొచ్చి పడా లనుకునే వాళ్ళు ఆ పిల్లలు తప్ప మరెవ్వరూ లేరు నా చిట్టితల్లి 'అన్ని' ఉంది, అది నేనుంటే మరి ఎవ్వరి దగ్గిరికీ వెళ్ళదు, 'నానమ్మా, చిట్టినానమ్మా, ముద్దు నానమ్మా!' అంటూ నన్ను పట్టుగుని' అంది. ఇంత స్మరణ జరిగిం తరవాత ముసలమ్మ పూర్తిగా సాధువైంది. అప్పుడు ఆమె ఆ కుర్రాణ్ణి ఉద్దేశించి, 'అది సహజమే, కుర్రతనంకాదు మరీ! దేవుడు వీణ్ణి రక్షించాలి,' అంది. ఆ ముసలమ్మ సంచీ ఎత్తి భుజంమీద వేసుగోడానికి సిద్ధపడుతూండగా, ఆ కుర్రాడు ఆమె ఎదరకి దూకి, 'నే తెచ్చిపెడతా నుండు తాతమ్మా; నేను ఆ దార్నే వెడుతున్నాను,' అన్నాడు ముసలమ్మ తల ఊపి, సంచీ కుర్రాడి వీపుమీదికి ఎత్తింది. వాళ్ళిద్దరూ ఏకమ్మట నడిచి పోయారు. తన రేగు బంధుకి మూర్తిను ఇమ్మని చెల్లించిన ఖరీదు సంగతే మరిచిపోయింది.

ముసలమ్మ. మాటా పలుకూ ఆడుకుంటూ వాళ్ళు వెళ్ళడం గమనిస్తూ మార్టిను నిలబడి పోయాడు.

వాళ్లు చూపుమేర దాటగానే మార్టిను ఇంట్లోకి వెళ్ళిపోయాడు. మెట్లమీదపడ్డ సులోచనాలు బద్దలుకాలేదు. తీసుగున్నాడు.-ఆరే పుచ్చుగుని. మళ్లీ పనిలో కూర్చున్నాడు. మరి కాస్సేపట్లో చర్మపు బెజ్జాల్లోంచి కుట్టుముల్లు గుచ్చడానికే వెలుగు చాలలేదు. క్షణంలో దీపాలవాడు వీధి దీపాలు వెలిగించదానికి బయల్దేరాడు. అతడు 'దీపా లెట్టే వేళఅయి నట్టుంది.' అనుకున్నాడు. లేచి వెళ్ళి లాంపు తుడిచి బాగుచేసి పైనపెట్టి మళ్ళీ పనిలో కూర్చు న్నాడు. ఒక బూటు పూర్తిచేసి, ఇటునించి అటు తిప్పి పరీక్షగా చూశాడు. అది అంతటా సరిగ్గా ఉంది. అప్పు డతడు పని ముట్లన్నీ పోగుచేసి. నేలమీది తుక్కు ముక్కలన్నీ తుడిచేసి, కుట్టుముళ్ళూ దారమూ ఆరేలూ ఎక్కడివక్కడ సర్ది. దీపం తెచ్చి బల్లమీద పెట్టుగున్నాడు. తరవాత అలమారలోంచి సువార్తల పుస్తకం తీశాడు. తను ఆపేసిన చోట్నించే మొద లెట్టే ఉద్దేశంతో ఆనవాలు తెలియడానికి అక్కడ ఒక మొరాకో చర్మంముక్క పెట్టాడు. కాని, తెరిచేసరికి మరో పుట వచ్చింది. అది తెరిచే టప్పుడు అతనికి గతరాత్రి కల జ్ఞాపకం వచ్చింది. అతని ఆలోచన దానిమీదికి పోయీ పోవడంలో, వెనకాల ఎవ శ్శైనా కదిల్తే అయినట్టు అడుగుల చప్పుడు అతనికి వినపడ్డ ట్టైంది. మార్టిను వెనక్కు తిరిగి చూడగా. చీకట్లో మూల ఎవరో నుంచున్నట్టుంది. కాని వాళ్ళు ఎవరో పోల్చుగోడానికి వీల్లేకుండా ఉంది. అతని చెవులో ఒక కంఠస్వరం 'మార్టిన్, మార్టిన్!

నన్నెరగవూ?, అంది. మార్టిను రహస్యంగా 'ఎవరువారు?' అని అడిగాడు. కంఠస్వరం 'నేనే' అంది. ఆచీకటి మూలనించి స్టెపానీ బయటికివచ్చి చిరునవ్వు నవ్వి మేఘంలా అంతరించాడు. కంఠస్వరం మళ్ళీ 'నేనే' అంది. ఆ చీకటి మూలనించి బిడ్డ నెత్తుగుని ఆ స్త్రీ బయటికి వచ్చి బిడ్డ పెద్ద నవ్వు నవ్వగా తను చిరునవ్వు నవ్వి బిడ్డతో సహా అంతరించింది. కంఠస్వరం ఇంకోసారి 'నేనే' అంది. రేగుపళ్ళ ముసలమ్మా ఒకరేగు పండు పుచ్చుగుని కుర్రాడూ బయటికి వచ్చి. ఇద్దరూ చిరునవ్వునవ్వి వాళ్ళిద్దరూ కుడా అంతరించారు,

మార్టిను ఆత్మ ఆనందంలో పడింది. అతడు శిలువరక్ష పెట్టుగుని, సులోచనాలు పెట్టుగుని, తెరిచేసరికి వచ్చిఉన్న చోటే ప్రారంభం చేస్తూ, ఆ పుటకి శిఖరంలో ఉన్న రీతిగా! 'నాకు ఆకలేసింది. నువ్వు నాకు ఆహారం ఇచ్చావు. నాకు దాహం వేసింది, నువ్వు నాకు పానీయం ఇచ్చావు. నేను పరాయి మనిషిని, నువ్వు నన్ను లోపలికి తీసుగువెళ్ళావు' అని చదువుకుని. ఆ పుట అడుగున: 'నా వాళ్ళైన ఇటువంటి అల్పులకి కూడా మీరు ఎంతచేసి ఉంటారో, అదంతా నాకే మీరు చేసినట్టు' అని కుడా చదువుకున్నాడు. తన కల యథార్థంలో జరిగింది కదా అని మార్టిన్ తెలుసుగున్నాడు, రక్షకుడు యథార్థంగా ఆ రోజున తన యింటికి రాగా తను ఆయనకి స్వాగతం ఇచ్చినట్టుకుడా అతనికి బోధపడింది.

---

# అభిమాన పుత్రుడు

("ఎవరేనా చెప్పేటప్పుడు మీరు వినుంటారు; నీ కన్ను పొడిచిన వాడి కన్ను పొడిచెయ్, నీ పల్లు పీకిన వాడి పల్లు పీకెయ్—అని, కాని, మీతోనే ననే దేమిటంటే; దౌర్జన్యపువాణ్ణి ఎదురుకోనెవద్దు—అని." (మత్తయి v. 38—39) "కసితీర్చుగోడం నా పని! చెల్లుపెట్టేవాణ్ణి నేను"

(రోమీ. xii—19)

ఒక పేద రైతుకి కొడుకు పుట్టాడు. అతడు ఎంతో సంభ్రమపడి, వెళ్ళి తన కుఱ్ఱాడికి అభిమాన జనకుడుగా ఉంటావా అని పొరుగింటి ఆయన్ని అడిగాడు. వాడు వీల్లేదు పొమ్మన్నాడు—పేదవాడి కొడుక్కి అభిమాన జనకుడుగా ఉండడం ఇష్టంలేక. ఆ రైతు మరో పొరుగువాణ్ణి ప్రార్థించాడు. వాడూ ఉండనన్నాడు. తరవాత ఆ పేద తండ్రి ఆ ఊళ్ళో ప్రతీ కొంపకీ వెళ్ళి చూసినా తన కొడుక్కి అభిమాన జనకుడుగా ఉండడానికి ఇష్టపడ్డవాడే కనపడలేదు. అందుచేత మరో గ్రామం వెళ్ళి యత్నించడానికి బయల్దేరాడు. అతడు దార్లో ఒక మనిషి ఎదురై ఆతణ్ణి ఆపి 'సుదినం మహాశయా! ఎక్కడికి బయల్దేరారు?' అని అడిగాడు. 'అయ్యా! దేవుడు నాకు ఓ కుఱ్ఱాణ్ణి ప్రసాదించాడు.—నా యవ్వనంలో నేను చూసి ఆనందించడానికి నా వార్ధకంలో నాకు సౌఖ్యం చేకూర్చడానికీ, నా మరణానంతరం నా ఆత్మశాంతికై ప్రార్థించడానికీనూ కాని. నేను పేదవాణ్ణి. మా ఊళ్ళో ఎవడూ కూడా వాడికి అభిమాన జనకుడుగా ఉండనన్నాడు. అందుకని, మరో ఊళ్ళో యత్నిద్దామని బయల్దేరాను' అని అతడు సమాధానం చెప్పాడు. ఆ కొత్త మనిషి, 'పోనీ అభిమాన జనకుడుగా

గా నే నుంటాను, ఉండనియ్యండి' అన్నాడు. రైతు సంతోషించి, అతడికి కృతజ్ఞత తెలిపి. 'కాని, అయ్యా! అభిమాన జననిగా ఉండండని ఎవర్నడగనూ?' అని ప్రశ్నించాడు. అందుకు ఆ కొత్తవాడు, 'పట్నం వెళ్ళండి, కూడలిలో ఒక రాతి యింటి ముందుభాగంలో షాపు లుంటాయి. ఆ షాపుల యజమాని సింహద్వారం దగ్గిరే ఉంటాడు అసలు. అతడి కూతురు మీ కుర్రాడికి అభిమాన జననిగా ఉండే ఏర్పాటు చెయ్యవలసిందని అతణ్ణి కోరండి' అని సలహా యిచ్చాడు. రైతు తటపటాయించాడు. 'అంత ధనిక వర్తకుణ్ణి ఎట్లా అడగానూ? అతడు నన్ను హీనంగాకట్టి, కూతురికి అంగీకారం ఇయ్యదేమో!' అన్నాడు. 'సందేహబాధ పడకండి. వెళ్ళండి, అడగండి. రేపు ఉదయానికి అన్ని ఏర్పాట్లూ పూర్తిచెయ్యండి. నామకరణంవేళకి నేనూ వస్తాను' అని కొత్తాయిన అన్నాడు. రైతు తన యింటికి వెళ్ళిపోయి, వర్తకుణ్ణి కనుక్కోడానికి గుర్రంమీద పట్నం బయల్దేరాడు. ఆ యింటికి వెళ్ళి గుర్రం దిగి దాన్ని కట్టెయ్య బోతూండగా వర్తకుడే వచ్చేశాడు.

వ—ఏం కావాలి మీకు?

రై—ఏమీ లేదండి, దేవుడు నాకు ఓ కుర్రాణ్ని ప్రసాదించాడు—నా యవ్వనంలో నేను చూసి ఆనందించడానికీ, నా వార్ధకంలో నాకు సౌఖ్యం చేకూర్చడానికీ, 'నా మరణానంతరం నా ఆత్మశాంతికై ప్రార్థించడానికీనూ. వాడి అభిమానజననిగా మీ అమ్మాయి ఉండడానికి మీరు దయచేసి ఒప్పుగోవాలి.

వ—నామకరణం ఎప్పుడూ?

రై—రేపు ఉదయం.

వ—సరే, మా భాగ్యం. మీరు ప్రశాంతంగా వెళ్ళండి. రేపు ఉదయప్రార్థన వేళకి మా అమ్మాయి మీ దగ్గిరికి వస్తుంది.

మర్నాడు ఉదయం అభిమానజనని వచ్చింది, అభిమానజనకుడు కూడా వచ్చాడు, శిశువుకి జ్ఞానస్నానం అయింది. అతంతు పూర్తికాగానే అభిమానజనకుడు వెళ్ళిపోయాడు. అతడెవడో ఎవళ్ళకీ తెలియదు. అతణ్ణి ఎవళ్ళూ మళ్ళీ చూడలేదు.

ii

కుర్రాడు ఎదిగాడు, తల్లిదండ్రుల్ని సంతోషపరిచాడు. అతడు దృఢంగా, పనంటే ఇష్టపడుతూ తెలివి కలిగి విధేయుడుగా పెరిగాడు. అతడి పదోయేట అతని తల్లిదండ్రులతణ్ణి చదవడం వ్రాయడం నేర్చుగోడానికి బడికి పంపించారు. ఇతరులు అయిదేళ్ళల్లో నేర్చుగునేది అతడు ఏడాదిలోనే గ్రహించే రకం అవడం చేత, కొద్దికాలంలోనే అతనికి బోధించవలిసింది మరేమీ లేకపోయింది. ఒకసారి ఈస్టరు పండుగ వచ్చింది. ఆ అబ్బాయి తన అభిమానజనని దగ్గిరికివెళ్ళి అభివందనం చేసివచ్చాడు. రాగానే, 'నా అభిమానజనకుడు ఎక్కడ ఉన్నాడు? వారికి కూడా నా ఈస్టరు అభివందనం చెప్పాలి' అని తల్లిదండ్రుల్ని అడిగాడు. అప్పుడతని తండ్రి. 'నాయనా! నీ అభిమానజనకుణ్ణి గురించి మాకేమీ తెలియదు. ఆ సంగతి తల్చుగుంటే మాకే విచారం వేస్తుంది. నీ జ్ఞానస్నానం అయినది మొదలు ఆయన్ని మేం మళ్ళీ చూడలేదు, ఆయన్ని గురించి వినాలేదు. ఆయన నివాసం ఎక్కడో తెలియదు. అసలు ఆయన ఇంకా జీవించి ఉన్నాడో

లేదో కూడా తెలియదు' అని చెప్పాడు. కుమారుడు తల్లిదండ్రులకి తలవంచి నమస్కారం చేస్తూ, 'అమ్మా, నాయనా! నా అభిమాన జనకుణ్ణి వెతుక్కోడానికి నన్ను వెళ్ళ నియ్యండి. నేనాయన్ని పట్టుగుతీరాలి, నా ఈస్టరు అభివందనం ఆయనకి చెప్పి తీరాలి,' అన్నాడు. తల్లిదండ్రులు ఆతణ్ణి వెళ్ళనిచ్చారు. అభిమానజనకుడి కోసం ఆ అబ్బాయి బయల్దేరాడు.

iii

ఆ బాలుడు ఇంట్లోంచి వచ్చి, ఒక రోడ్డు పుచ్చుగుని బయల్దేరాడు. కొన్ని గంటలు అతడు నడిచే సరికి ఒక కొత్తమనిషి అతడికి ఎదురై అతణ్ణి ఆపి.

—నీకు సుదినం, అబ్బాయీ! ఎక్కడికి నీ ప్రయాణం?

బా—నేను నా అభిమాన జననిని దర్శించి ఆవిడకి నా ఈస్టర్ అభివందనం అర్పించి, ఇంటికి రాగానే, నా అభిమాన జనకుడికి కూడా నా ఈస్టర్ అభివందనం చెప్పదలిచి ఆయన నివాసం ఎక్కడ అని నా తల్లిదండ్రుల్ని అడిగాను. ఆ సంగతి తమరికి తెలియదన్నారు వాళ్ళు. నా నామకరణం అయీ అవడంతో ఆయన వెళ్ళిపోయాడనీ, మరి ఆయన్ని గురించి ఏమీ తెలియదనీ, ఆయన ఇంకా సజీవుడేనా అనేది కూడా తెలియదనీ అన్నారు. కాని, నా అభిమాన జనకుణ్ణి నేను చూడ దల్చాను, అందుకని ఆయనకోసం వెతుక్కుంటూ బయల్దేరాను.

కొత్త—నేనే, నాయనా, నీ అభిమానజనకుణ్ణి.

అ మాటకి బాలుడు సంతోషపడి ఈస్టర్ అభివందనం చెయ్యడానికి మూడుసార్లు ఆయన్ని ముద్దెట్టుగుని,

—అభిమానజనకా, మీరు ఎటు వెడుతున్నారూ? మా వైపు వస్తున్నారా, దయచేసి మా యింటికి రండి. లేక మీ యింటికి పోతున్నారా, నేను వచ్చేస్తాను మీతో.

కొ_త్త—ప్రస్తుతం మీ యింటికి రావడానికి తీరుబడిలేదు నాకు. చాలా గ్రామాల్లో పనుంది నాకు. రేపటికి గాని తిరిగి రా నింటికి. కనక రేపొచ్చి చూడు.

బా—అభిమానజనకా: మిమ్మల్ని ఎల్లా నేను తెలుసుగోడం?

కొ_త్త—మీ యింటి దగ్గిర్నించి తిన్నగా తూర్పుదిశలో నడు. ఒక అరణ్యం వస్తుంది. అందులో చొచ్చుకునిపోతే, ఒక ఖాళీ స్థలం కనిపిస్తుంది. అక్కడికి చేరుకోగానే, కాస్సేపక్కడ కూచుని, విశ్రమిస్తూ, చుట్టుపక్కల ఏం జరుగుతూంటుందో కళ్ళెట్టుగునిచూడు. ఆ ఖాళీ దాటి నువ్వు వెడితే అవతల ఒకతోట ఉంటుంది. ఆ తోటలో బంగారు పైకప్పుతో ఒక ఇల్లు ఉంటుంది. అదీ నా గృహం. నువ్వు ఆ యింటి గేటు దగ్గిరికి, రా—నీకు స్వాగతం ఇయ్యడానికి స్వయంగా నేనే ఉంటాను.

అని, ఆ అభిమానపుత్రుడు చూస్తూండగానే, ఆ అభిమాన జనకుడు అదృశ్యుడయాడు.

## iv

ఆ బాలుడు తన అభిమానజనకుడు చెయ్యాలన్నట్టే చేశాడు. తూర్పుగా నడిచాడు, అడివి చేరుకున్నాడు, ఖాళీ స్థలానికి వచ్చాడు. ఆ స్థలం మధ్య చాలా ఎత్తుగా ఓ చెట్టుంది, దాని కొమ్మల్లో ఒక దానికి ఒక తాడు వేళ్ళాడుతూ ఉంది. ఆ తాడు

చివర ఒక బరువైన టేకు పలక లాంటిది మూడెట్టి నేలంటుతూ ఉంది. ఈ దుంగకి కేవలం అడుగున తేనెతో నిండిఉన్న కర్ర తొట్టి ఉంది. ఆ అబ్బాయి ఆశ్చర్యపడిపోయి ఈ తేనె ఎందుకు పెట్టారిక్కడా, దీన్ని ముట్టుకుంటూ ఈ దుంగ ఏమిటీ అని ఇల్లా అనుకోడం మొదలెట్టాడో లేదో, అమట్టుగా ఓ వేపు అడివిలోంచి గలగల శబ్దంచేస్తూ ఎలుగుబంట్లు వచ్చి పడుతున్నాయి —తల్లి, ఒక ఏడాది పిల్ల, మరి మూడు చంటికూనలు, తల్లిఎలుగు ముట్టెతో గాల్ని పసికడుతూ, తిన్నగా తొట్టె దగ్గిరికి వెళ్ళింది. వెనకాలే కూనలు వెళ్ళాయి. అది తన ముట్టె తేనెలో ముంచి, ఇల్లానే మీరూ చెయ్యండని కూనలకి సంజ్ఞచేపించి, అర్థ దిద్దం పరుగులెత్తుతూ అవికుడా తినడం మొదలెట్టాయి. తేనెని అంటుతూ వేళ్ళాడే దుంగ అడ్డు గనక దానిని తల్లి తలతో పక్కకి నెట్టింది. అది ఒక క్షణం ఊగి మళ్ళీ రావడంలో కూనల్ని ఒక చిన్న తోపుతోసింది. ఈ సంగతి కనిపెట్టి, తల్లి, తన పంజాతో ఆ దుంగని ఊపుతూ తోసేసింది. అది ఊగి చాలా ఎత్తుకి వెళ్ళి తిరిగి రావడంలో చాలా జోరుగావచ్చి, ఒక కూనని వీపుమీదా, మరో కూనని తలమీదా ఈడ్చి కొట్టింది. బాధతో మొరుక్కుంటూ కూనలు పారిపోయాయి తల్లి, కోపంతో గర్జించి, తన రెండు ఎదిరి పంజాలతోటీ ఆ దుంగ దొరకపుచ్చు గుని, తన నెత్తిమీదికి కుడా దాన్ని ఎత్తి, గిరవటేసేసింది. దుంగ చాలా ఎత్తుకి ఎగిరింది. ఆ సందులో ఏడాది పిల్ల తొట్టె దగ్గిరికి చొరపడి, ముట్టె తేనెలోముంచి చప్పుడు చేస్తూ పీల్చడం మొదలెట్టింది. కూనలు కుడా తొట్టె దగ్గిరికి రాబోతున్నాయనగా

దుంగ చాల జవంతో కిందికివస్తూ ఆ ఏడాది పిల్ల నలకాయి బద్దలుకొట్టగా, ఆ పిల్ల చచ్చిపోయింది. తల్లి. వెనకటి గర్జనకి రెట్టింపు గట్టిగా గర్జించి, ఆదుంగని పట్టుగుని తన యావద్బలంతో దాన్ని విసిరి పారేసింది. ఆ తాడు కట్టిన కొమ్మకంటె పై ఎత్తుకి ఎగిరింది దుంగ. బరువుకట్టిన తాడుకి ఉండ వలిసిన బిగువు సడలి పోయేటంత ఎత్తుకి అది ఎగిరిందంటే నమ్మండి. అప్పుడు తల్లీ, వెనకాలే కూనలూ తొట్టె దగ్గిరికి మళ్ళీ వచ్చాయి. దుంగ ఎగిరి ఇంకా ఎగిరి ఆగి తిరుగు మొహంపట్టి దిగుతూ, దిగినకొద్దీ వేగం పెరగగా తొట్టె సమీపించే సరికి ఉందే మిక్కిలి ఎక్కువ వేగంతో డీక్కొని తల్లిఎలుగు తల రెండు చెక్కలు చేసింది. తల్లిఎలుగు దొర్లిపోయి కాళ్ళాడక పడి చచ్చిపోయింది. కూనలు అడివిలోకి పారిపోయాయి.

V

ఆశ్చర్యంతో అదంతా ఆ బాలుడు గమనించి, ముందుకి సాగి పోయాడు. కొంత సేపటికి అరణ్యం అంతమై ఒక పెద్ద వనం కనిపించింది. దాని మధ్య బంగారు పైకప్పుతో ఒక బ్రహ్మాండ మైన సౌధం ఉంది. గేటు దగ్గిర చిరునవ్వుతో నుంచుని ఉన్నాడు అతడి అభిమానజనకుడు. అతడు తన అభిమాన పుత్రుడికి స్వాగతం ఇచ్చి, గేటులోంచి తోటలోకి ఆ అబ్బాయిని తీసుగు వెళ్ళాడు. అంత అందమూ అంత ఆనందమూ పరివేష్టించి ఉండే స్థలం ఉండగలదని ఆ బాలుడు స్వప్నేపి అనుకోలేదు. తరవాత అతని అభిమానజనకుడు అతణ్ణి సౌధంలోకి తీసుగుని వెళ్ళాడు. అది పైన కంటె లోపల మరీ అందంగా ఉంది. ఆయన ఆ బాలు

డికి ఒక్కొక్క గదే చూపించాడు. ఒక గదికంటె మరొకటి మరీ కల కల లాడుతూ మరీ రమణీయంగా ఉంది. కాని, చిట్ట చివరికి వాళ్ళు ఒక సీలువేసిన తలుపు దగ్గిరికి వచ్చారు. ఆయన, 'ఈ తలుపు చూశావా అబ్బాయి! దీనికి తాళం లేదుకాని సీలు ఉంది. ఇది తెరవగలం తెరవడం నేను నిషేధిస్తున్నాను. ఇక్కడనువ్వు ఉండవచ్చు, నీ యిష్టప్రకారం ఇటూ అటూ వెళ్ళవచ్చు. ఇక్కడి ఆనందాలన్నీ అనుభవించవచ్చు. నాది ఒకే ఒక ఆజ్ఞ—ఈ తలుపు తెరవకు. కర్మవశాత్తూ ఎప్పుడేనా తెరుస్తావా, అడివిమధ్య నువ్వు చూసింది జ్ఞాపకం తెచ్చుకో' అన్నాడు అనేసి అభిమానజనకుడు వెళ్ళిపోయాడు. అభిమానపుత్రుడు అ సౌధంలో ఉండిపోయాడు. అక్కడ జీవితం ఎంత ప్రతిభావంతంగా ఎంత ఆనందంగా ఉందంటే, ఆ ఉండడం ఉండడం ముప్పైఏళ్ళు ఉండిపోయి, తనున్నది మూడుగంటలే అనుకున్నాడు కూడానూ! ముప్పై ఏళ్ళ అనంతరం ఒకనాడు అభిమానపుత్రుడు సీలుగది దాటి వెళ్ళడం తటస్థించగా, అభిమానజనకుడు ఆ గదిలో ప్రవేశించడం ఎందుకు నిషేధించాడా అని ఆశ్చర్యపడడం మొదలెట్టాడు. ఒక్కసారి దృష్టి లోపలికి పోనిచ్చి, అక్కడ ఏముందో చూద్దాం' అని అతడు అనుకున్నాడు. అనుకుని, తలుపు ఇట్టే తోశాడు. సీళ్ళు ఊడిపోయి, తలుపు బార్లా తెరుచుగుంది. అభిమానపుత్రుడు లోపల ప్రవేశించగా తక్కిన వాటికంటె మహోన్నతమై రమ్యమైన ఒక హాలు చూశాడు. దానిమధ్య సింహాసనం ఉంది. అతడు కాస్సేపు హాల్లో ఇటూ అటూ తచ్చాడి, మెట్లెక్కి, మెల్లిగా

సింహాసనంమీద ఆసీనుడయాడు. అక్కడకూర్చుంటూ ఆ సింహాసనానికి అనుకుని ఉన్న ఒక కనకదండం చూశాడు. ఆ దండాన్ని అతడు చేత్తో పట్టుగోవడం ఏమిటి, ఆ హాలుయొక్క గోడలు నాలుగూ అదృశ్యంకావడం ఏమిటి! అభిమానపుత్రుడు చుట్టూ చూసేసరికి అతడికి ప్రపంచం యావత్తూ గోచరించింది, మానవులు చేస్తూండేదంతా కనపడింది. ఎట్టయెదరగా సముద్రమూ దానిమీద ఓడలూ కనిపించాయి. అతడి కుడివైపు అనార్యులు కనపడ్డారు, వికృతంగా అతడు ఎడమకి చూడగా, రష్యనులుకాని క్రైస్తవులు కనపడ్డారు. అతడు వెనక్కితిరిగి చూడగా ఆ నాలుగోవైపు తనవంటి రష్యనులు కనిపించారు. అతడు, 'నా యింటి పట్టున ఏం జరుగుతోందో చూస్తాను, పంట బాగా పండిందేమో' అనుకున్నాడు. వాళ్ళనాన్న పొలాలకేసి చూశాడు. మొక్కలు నిటాగ్గూఉండి కంకులు కనిపిస్తున్నాయి. పంట ఏమాత్రం ఉంటుందో లెఖ్ఖ కట్టడానికి అతడు కంకులు లెఖ్ఖపెట్టాలనుకున్నాడు. ఇంతలో ఒక రైతు అక్కడికి బండి తోలుకు వచ్చాడు. అది రాత్రి, తన తండ్రే రాత్రివేళ ధాన్యం బండిమీద వేసి పట్టికెళ్ళడానికి వచ్చాడేమో అని అభిమానపుత్రుడు అనుకున్నాడు. కాని, అతడు తీరాచూసి తిన్నగా గుర్తుపట్టేసరికి వాడు తనెరుగున్న ఒక దొంగాడు. వాడు రహస్యంగా రాత్రి వచ్చి కంకులన్నీ బండిమీదవేసి పట్టుకుపోతున్నాడు. అభిమానపుత్రుడికి కోపంవచ్చి, 'నాన్నా! మన పొలంలోంచి కంకులు తస్కరించేస్తున్నారు' అని కేకవేశాడు. రాత్రి మేలకి బీటికి గుర్రాల్ని తోలుకు వెళ్ళిన వాళ్ళనాన్న ఈ కేకతో లేచాడు.

లేచి. 'నా కంకులన్నీ ఎవళ్ళో దోచుకు పోతూన్నట్టు నాకు కల వచ్చింది, గుర్రంమీద అక్కడికివెళ్ళి చూస్తాను. పోనీ' అను కుని, గుర్రంమీద పొలంవెళ్ళాడు, ఆయన అక్కడ దొంగాణ్ని చూసి, ఇతర రైతుల్ని సాయానికి పిలవగా, వాళ్ళంతా కలిసి వాణ్ని కొట్టికట్టి చెరసాలకి ఈడ్చారు. తరవాత అభిమానపుత్రుడు పట్నంకేసి చూశాడు తన అభిమానజననికోసం. ఆవిడ ఒక వర్తకుణ్ణి పెళ్ళాడింది. ప్రస్తుతం ఆవిడ నిద్దరపోతోంది. భర్త మెల్లిగా లేచి తన ఉంపుడుకత్తె యింటికి వెళ్లాడు. అభిమాన పుత్రుడు 'లేవమ్మా లేవమ్మా. నీ భర్త చెడుమార్గాల్లో పడిపో యాడూ!' అని ఆవిణ్ణి ఉద్దేశించి కేకపెట్టాడు. అభిమానజనని పక్కలోంచి ఇవతలకి దూకేసి, దుస్తులు ధరించేసి. భర్త వెళ్ళిన ఇల్లు పట్టుగుని, ఆ ఉంపుడు కత్తెని అవమానపరిచి పైగా దాన్ని చావగొట్టి. భర్తని ఇంటికి తోలుకుపోయింది. తరవాత, అభిమాన పుత్రుడు తన కన్న తల్లిని చూశాడు. ఆవిడ తన యింట్లో నిద్దర పోతోంది. దొంగా డొకడు కొంపలోకి పాకి దూరేశాడు. ఆవిడ తన వస్తువులు పెట్టుగున్న పెట్టె వాడు తెరవాలని చూస్తు న్నాడు. తల్లికి మెలకువ వచ్చి కీచుమని అరిచింది. దొంగాడు గొడ్డలి తన చేత్తోపట్టుగుని, ఆవిణ్ణి చంపడానికి, చెయ్యెత్తి అది ఊగించుతున్నాడు. అభిమానపుత్రుడు మరి ఆగలేక, ఆ దొంగాడి మీద తన కనకదండం విసిరాడు. అది దొంగాడి కణతకి తగలగా వాడు సుంచున్న పళంగా చచ్చిపోయాడు.

## vi

అభిమానపుత్రుడు దొంగని చంపగానే గోడలువచ్చేసి హాలు యథాప్రకారంగా తయారైంది. ఒక తలుపు తెరుచుకోగా అభిమాన జనకుడు ప్రవేశించి అభిమాన పుత్రుడి దగ్గిరికి వెళ్ళి

అతణ్ణి చేత్తో పట్టుగుని సింహాసనం మీది నించి దింపే శాడు. ఆయన, 'నువ్వు నా ఆజ్ఞ అనుసరించ లేదు. నువ్వు చేసిన ఒక తప్పు తెరవడం నిషేధింపబడ్డ తలుపు తెరవడం. మరొక తప్పు, నా సింహాసనం అధిష్ఠించి నా దండం చేతపట్టడం. ఇప్పుడు చేసిన మూడో తప్పువల్ల ప్రపంచంలో కీడు చాలా పెరిగి పోయింది. మరో గంటగాని నువ్వు అక్కడ కూర్చుని ఉంటే, ఈ పాటికె మానవజాతి సగం నశించి ఉండేది' అన్నాడు. అని, అభిమానపుత్రుణ్ణి తీసికెళ్ళి మళ్ళీ సింహాసనంమీద కూచోపెట్టి, దండం తను పుచ్చుగున్నాడు. మళ్ళీ హాలుగోడలు నాలుగూ మాయంకాగా, సకల విషయాలూ దృగ్గోచరం అయినాయి. అప్పుడు అభిమానజనకుడు, 'అబ్బాయి! చూడు నువ్వు మీ నాన్నకి ఏంచేసి పెట్టావో! వసిలి అనే తస్కరుడు సంవత్సరంనించి ఖైదులోవుండి బైటికి వచ్చాడు. ఆ రావడంలో దుష్టత్వంలో ఉండే ప్రతీ రకమూ బాగా అభ్యసించి, ఇప్పుడు కేవలం శిక్షాతీతుడై పోయాడు, చూడు. నీ తండ్రి గుర్రాలు రెండింటిని తస్కరించి, ఇప్పు డతని ధాన్యరాశి తగలపెడు తున్నాడు. నువ్వే మీ నాన్న నెత్తిమీదికి ఇంతా తెచ్చిపెట్టింది' అన్నాడు. తన తండ్రి ధాన్యరాశి నిప్పంటుగోవడం అభిమానపుత్రుడికి కనపడింది, గాని అభిమానజనకుడు ఆ దృశ్యం తెరచాటుచేసి, మరోవైపు చూడవలిసిందని బాలుడితో చెప్పాడు 'ఇదుగో చూడు. నీ అభిమానజనని భర్త. సంవత్సరం కిందట తన భార్యని వదిలేశాడు. ఇప్పుడు అన్యస్త్రీలతో తిరుగుతున్నాడు. అతడి మొదటి ఉంపుడుకత్తె మరీ అధోగతిలోకి దిగిపోయింది.

దుఃఖం ఎక్కువై నీ అభిమానజననిని తానుకుటో పడగొట్టింది. ఇదీ నువ్వు నీ అభిమానజననికి చేసిపెట్టింది,' అని ఆయన అన్నాడు. అని, ఆ దృశ్యంకుడా చాటుచేసి, తమ యింటికేసి చూడవలిసిందని బాలుణ్ణి కోరాడు, బాలుడు చూశాడు, చేసిన పాపాలకి పశ్చాత్తాపులై తల్లి వెక్కివెక్కి యేడుస్తూ, 'అయ్యో! ఆ రాత్రి ఆ దొంగాడే నన్ను చంపేసుంటే ఎంత బాగుండేదీ! ఇంత ఘోరంగా పాపాలు చేసుండక పోయుందును గదా, అను కుంటోంది, ఇదీ! నీ తల్లికి నువ్వు చేకూర్చిపెట్టింది' అన్నాడు అభిమానజనకుడు. ఈ దృశ్యం కుడా మాటుపరిచేసి, అతడు అడుక్కి చూపించాడు. ఇద్దరు కాపలాభటులు దొంగాడి శవాన్ని చెఱశాల ఎదట పట్టుగుని ఉన్నారు. అప్పుడు అభిమానజనకుడు. 'ఆ దొంగాడు లోగడ పదిపందిని హత్యచేశాడు. వాడి పాపాలు వాడే పరిహరించుగోవలిసిన మాట. కాని. వాణ్ణి చంపేశావో, వాడి పాపాలన్నీ నే నెత్తిని వేసుగున్నావో! "అదీ నీకు నువ్వు చేసుగున్న ఉపకారం. తల్లి ఎలుగు ఆ మంగని మొదటిసారి కొంచెం పక్కకి తోస్తే, అదివచ్చి కూనల్ని చెదరగొట్టింది. రెండోసారి దాన్ని గెంటేసరికి అది ఏడాదిపిల్లని చంపేసింది. మూడోసారి దాన్ని విసిరేసరికి, అది తన్నే చావగొట్టింది, ఆ మాదిరిగానే నువ్వూ వ్యవహరించావు. ఇదుగో యిప్పుడు నీకు ఓ ముప్పైఏళ్ల వ్యవధి ఇస్తున్నాను. నువ్వు ప్రపంచంలోకి వెళ్లి ఆ దొంగాడి పాపాలకి పరిహారం చేసుగో. అవి పరిహారం చేసుగోకపోతే, వాడిస్థానంలో నువ్వుండాలి' అన్నాడు. ఆ బాలుడు 'దొంగాడి పాపాలు నే నెల్లా పరిహారం చేసుగోడం?' అని అడి

గాడు, అందుకు అభిమానజనకుడు 'నీమూలంగా ప్రపంచంలోకి ఎంత కీడు వచ్చిందో అంతకీడూ నువ్వు ప్రపంచంలోంచి తీసేస్తే. అక్కడిలో నీ పాపాలూ నువ్వు పరిహాసించు గున్నట్టవుతుంది, దొంగాడి పాపాలూ పరిహారించిపెట్టి నట్లవుతుంది' అని సమాధానం ఇచ్చాడు. 'ప్రపంచంలో కీడు నశింపచెయ్యడం ఎట్లా?' అని బాలుడు మళ్లీ ప్రశ్నించాడు. దానికి అభిమానజనకుడు 'బయలుదేరు. సూటిగా తూర్పువైపునకు. కొంత సేపటికి నువ్వు ఓ పొలంలోకి వెడతావు. అక్కడమనుషులుంటారు వాళ్ళేం జేస్తారో చూస్తూ, నీకు తెలిసిందేమిటో వాళ్ళకి బోధించు. ఇంకా సాగిపో. నీ కంటపడేది గమనించు. నాలుగోనాడు నువ్వు ఓ అడివి చేరుకుంటావు. ఆ అడివి మధ్య ఓ గుహ ఉంది. ఆ గుహలో ఒక ఋషి నివసిస్తున్నాడు. జరిగింది యావత్తూ ఆయనతో చెప్పు. నీకర్తవ్యం అతడు బోధిస్తాడు. అతడు నీతోచెప్పిన ప్రకారం యావత్తూ నువ్వు చేసిననాడు నీ పాపాలకీ దొంగాడి పాపాలకీ పరిహారం అయిందన్నమాట.' అని ఉపదేశించాడు. ఉపదేశించి, అభిమాన జనకుడు అభిమానపుత్రుణ్ని గేటువాటించి బయటికి పంపించాడు.

## vii

అభిమానపుత్రుడు తన దారిని పోతూ, మనసులో: 'ఈ ప్రపంచంలో కీడు ఎల్లా పోగొట్టగలనూ! కీడు పోగొట్టడానికి, కీడు చేసేవాళ్ళని ఖైదేనే చెయ్యాలి, లేక చంపేనా వెయ్యాలి. అందు చేత, ఇతరుల పాపాలు నాకు సంక్రమింప చేసుగోకుండా ఎల్లా కీడు నాశనం చెయ్యసుమరీ!' అనుకున్నాడు. ఈ విషయం అతడు ఎంత దీర్ఘంగా ఆలోచించినా ఓ కదరికి రాలేకపోయాడు. ముందుకి

సాగిపోయి, అతడు ఒక పొలం తొక్కాడు. దండిగా పసందుగా పెరిగి కోతకి సిద్ధంగా ఉంది. ఒక చిన్న ఆవుదూడ చేలోపడింది. పక్కనే ఉన్న కొందరు మనుషులు దాన్నిచూసి, అవతలకి కొట్టెయ్యడానికి గుర్రాలెక్కి దాన్ని వెంటతరమగా చేలో ముందరికీ వెనక్కీ అది పరుగులు మొదలెట్టింది. అదిఒక గట్టుదాకా వచ్చి. మరి బయటికి రావడానికి సిద్ధంగా ఉన్నప్పుడు, అక్కడికి ఎవడో వేళ్ళేసరికి అది బెదిరి పోనూనూ, వెనక్కి తిరిగి మళ్ళీ చేనుకి అడ్డంపడనూనూ చేనంతా మట్టగించేస్తూ వాళ్ల దాని వెనకాల ధౌడు తియ్యనూనూ: పక్కనిపోయే రోడ్డుమీద ఒక స్త్రీ దుఃఖిస్తూ 'నా దూడ చావు చూసేవరకూ దాన్ని వీళ్ల వెంట తరుముతారు' అంది. అభిమానపుత్రుడు ఆ రైతులతో, 'ఏమిటి మీరు చేస్తూంటా? మీరంతా బయటికి రండి చేను లోంచి. ఆ స్త్రీ తన దూడని బయటికి రమ్మని పిలుస్తుంది, పిలవనియ్యండి' అన్నాడు. వాళ్ళు ఆప్రకారం చేశారు, ఆ స్త్రీ ఓ గట్టు దగ్గిరికివచ్చి దూడతో, 'బయటికి వచ్చేసెయ్, నా కూనా. బయటికి వచ్చేసెయ్' అని చెప్పింది. నిక్కపొడిచిన చెవుల్తో ఆమాటలు ఒక్కక్షణం శ్రద్ధగావిని. ఆదూడ తనకే తోచి వ్యవహరిస్తూన్నట్టు ఆ స్త్రీవైపు పరిగెత్తి. తన తల ఆమె దుస్తుల్లో దాచుగునే యత్నంలో అవిణ్ణి పడగొట్టేటంత పనిచేసింది. ఆ మనుషులూ సంతోషించారు, ఆ స్త్రీ సంతోషించింది, ఆ చిన్న దూడా సంతోషించింది. అభిమానపుత్రుడు ముందుకి సాగిపోతూ, 'ఇప్పుడు నాకు బోధపడింది. కీడువల్ల కీడు వ్యాపిస్తుంది. కీడుని తరిమెయ్యాలని చూసినకొద్దీ, కీడు పెరుగుతుంది. మరి. కీడుని

నాశనం చెయ్యడానికి మార్గమేమిటో నాకు తెలియకుండా ఉంది. ఆ దూడ తన యజమానురాలిమాట అనువర్తించింది. కనకనే అంతా బాగా నడిచిపోయింది. కాని, ఆ దూడ ఆవిడమాట అనువర్తించకుండా ఉంటే, దాన్ని చేనులోంచి బయటికి ఎట్లా తీయగలిగి ఉండేవాళ్ళం? అనుకున్నాడు. మళ్ళీ యోచించాడు. కాని, ఓ దారికి రాలేకపోయాడు. ముందుకి సాగిపోయాడు.

## viii

అతడు నడిచి నడిచి ఓ గ్రామం చేరుకున్నాడు. గ్రామం చివరకెళ్లి ఓయింట్లో ఆ రాత్రికి బసగోరాడు. ఇంటావిడ ఒంటరిగా ఉంది, ఇల్లు బాగుచేసుగుంటోంది. ఆవిడ బస యిచ్చింది. అభిమానపుత్రుడు ప్రవేశించి, ఇటుకతో కట్టిన పంపటి మిద్దెమీద కూర్చుని, ఆవిడ చేసేదంతా చూశాడు. ఆవిడ ఒక బ్రష్ పుచ్చుగుని నేలతోమి బల్లకుడా తోమబోతూంది. ఆ బల్ల తోమిన తరవాత, ఆవిడ ఓ అలుకు గుడ్డతో దాన్ని తుడవడం మొదలెట్టింది. ఈ మూలనించి ఆ మూలకి ఎంత తుడిచినా ఆ బల్ల శుభ్రపడదే! అలుకుగుడ్డ తాలూకు మట్టిమరకలు పోయినాయిగాని కొత్తవిలేచాయి. మొదణ్ణించి చివరదాకా ఆవిడ మళ్లీ తుడిచింది. వెనకటిలాగే జరిగింది. ఆ మురికిగుడ్డ బల్లని మురికి చేసింది. ఒక మురికిచార పోతూంటే మరోటి సిద్ధం అవుతోంది. అభిమానపుత్రుడు కొంతసేపు ఇదంతా నిశ్శబ్దంగా చూస్తూ, 'అమ్మా! ఏమిటి చేస్తున్నారు?' అని అడిగాడు. ఆవిడ, 'కనపడటంలేదు, నాయనా! పండగఅని ఇంటిబాగులు చేస్తున్నాను. ఈబల్ల సుబ్భరపడకుండా వచ్చింది. నాకు విసిగెత్తి పోతోంది,

అంది. 'తుడిచే గుడ్డని ముందు శుభ్రంగా ఉతుక్కో రండి, తరవాత అదెట్టి బిల్లతుడిచి సుబ్భరం చేస్తురుగాని.' అని ఆయన ఉపాయం చెప్పాడు. 'కృతజ్ఞురాల్ని. అల్లాగే చేస్తాను' అంది ఆవిడ. ఉదయాన్ని అక్కడ సెలవు తీసుకుని అతడు నడక సాగించాడు. చాలా సేపు నడిచి అతడు ఒక అడివి చివరకి వచ్చాడు. అక్కడ కొందరు రైతులు బండి చక్రాలకి కర్రచుట్లు చేస్తున్నారు. వాళ్ళనిసమీపించి అతడు చూడగా, వాళ్లు గిర గిరా తిరుగు తున్నారు గాని ఆ కర్రని వంచలేకుండా ఉన్నారు. అతడు నిలబడి చూస్తూనే ఇన్నాడు. అతడు గమ నించిం దేమిటంటే: ఏ దిమ్మకి ఈ కర్ర బిగించి ఉందో, ఆ దిమ్మకుడా గిర్రున తిరుగుతూనేఉంది, వాళ్ళు గిరగిరా తిరిగే టప్పుడు! 'స్నేహితులారా, ఏం జేస్తున్నారు?' అని అతడు వాళ్ళని ప్రశ్నించాడు. 'ఏముందీ! మీరు చూడటం లేదూ? మేం చక్రాలకి చుట్లు చేస్తున్నాం. ఈ కర్రని రెండుసార్లు ఆవిరిలో కాచాం. మాకువిసిగెత్తిపోతోంది. ఈ కర్ర వంగకుండా వచ్చింది' అనివాళ్ళు చెప్పారు, అభిమానపుత్రుడు, 'అట్లాకాదు, స్నేహితు లారా! ఆ దిమ్మ స్థిరంగా ఉండేటట్టు పాతండి. లేకపోతే, మీరు గిర గిరా తిరిగే టప్పుడు అదీ తిరుగుతుంది,' అని సలహా యిచ్చాడు. రైతులు ఆ సలహా ప్రకారందిమ్మని స్థిరపరచగానే, వాళ్ళపని కులాసాగా సాగిపోయింది. ఆ రాత్రి వాళ్ళతో గడిపి అభిమానపుత్రుడు ప్రయాణం సాగించాడు. అతడు పగలంతా తరవాత రాత్రంతానడిచి తెల్లారకట్టకి పూర్వమే కొందరు పసుల కాపర్లు రాత్రి బస చేసుకుని అక్కడే పక్కని పడుకున్నాడు. వాళ్ళు పసుపులగురించి కట్టుదిట్టాలు చూసుగుని, నిప్పు చెయ్య

డానికి యత్నించారు. ఎండు చిదుగులు తెచ్చి, నిప్పు ముట్టించి, ఆ నిప్పు ఇంకా పూర్తిగా చిదుగులకి అంటక పూర్వమే, వాళ్ళు మోపెడు పచ్చిరకం తడిపుడకలు తెచ్చి చిదుగులమీద కప్పెట్టే శారు. ఆ పుడకలు కాస్సేపు బుస్సుమనగా ఆ కాస్త నిప్పు నీళ్ళు కారిపోయి, మరి కాస్సేపటికి ఆరేపోయింది. తరవాత, పసుల కాపర్లు మళ్ళీ చిదుగులు తేవడం, వాటికి నిప్పుముట్టించడం. తడి పుడకలతో వాటిని కప్పెట్టి వాటికి వాయుబంధం చెయ్యడం సాగించారు. నిప్పు మళ్ళీ ఆరిపోయింది. వాళ్ళు ఎంతసేపు గిజ గిజ లాడినా, మంట చెయ్యలేకపోయారు అప్పుడు అభిమాన పుత్రుడు: 'అయ్యా! పెద్దపుడకలు తెచ్చి వెయ్యడం గురించి మరీ తొందరపడకండి, ఎండు చిదుగులు పూర్తిగా కాలి మంట అయేవరకూ ఆగి, తరవాత ఆ పైని వెయ్యండి. ఏ పుడకలు వేసినా, మంట సిద్ధించిన తరవాత మనచిత్తం వచ్చినంత వంట చెరకు వెయ్యవచ్చు పైన.' అని సలహా యిచ్చాడు. పసుల కాపర్లు ఆ సలహా అవలంబించి చిదుగుల నిప్పు బాగా జ్వాల అయిన తరవాతే పెద్దపుడకలు తగిలించడం మొదలెట్టగా, అది ఎంతో మండిపడి కాస్సేపట్లో మహాజ్వాల అయిపోయి గర్జించడం మొదలెట్టింది. కొద్దికాలం వాళ్ళతో ఉండి, అతడు ముందుకి పోయాడు. ఈ చూసిన మూడు సందర్భాలకీ అంతర్యం ఏమై ఉంటుందా అని ఆశ్చర్యపడ్డాడుగాని, వాటిలోతు అతనికి తెలియ లేదు.

## ix

అభిమానపుత్రుడు పగలంతా నడిచి సాయంత్రానికి మరో అడివి చేరుకున్నాడు. అందులో ఒక ఋషి పటీరం చూసి,

తలుపు తట్టాడు. 'ఎవరువారు?' అని లోపల్నించి కేక వినిపించింది. అబిమానపుత్రుడు 'ఒక మహాపాపిని. మరొకరిపాపాలూ నా పాపాలూ కూడా పరిహారం చేసుగోవాలి,' అని సమాధానం చెప్పాడు. ఈ మాటలు విని ఋషి పైకి వచ్చాడు. 'నువ్వు మొయ్యవలసొచ్చిన మరొకరి పాపా లేమిటీ?' అని బాలుణ్ణి అడిగాడు. బాలుడు యావత్తూ ఏకరు వెట్టాడు—తన అబిమాన జనకుడి గురించీ, సీలువేసిఉన్న గదిలోని సింహాసనం గురించీ. అభిమానజనకుడి ఆజ్ఞల గురించీ, చేసులో ధాన్యపు మొక్కల్ని చితగ తొక్కేస్తూ కనిపించిన రైతు రౌతుల గురించిన్నీ యజమానురాలి పిలుపుకె బయటికి వచ్చిన దూడ గురించిన్నీ.

బా—కీడుచేసి కీడు నాశనం చెయ్యలేం అని నాకు అనుభవం అయింది. కాని అది మరి ఏ మార్గాన్ని నాశనం చెయ్యాలో నాకు తెలియకుండా ఉంది. ఆ మార్గం మీరు నాకు బోధించండి.

ఋ—దారిలో మరేమి చూశావో, చెప్పు.

ఒక స్త్రీ బిల్లి సుబ్బరం చెయ్యడం, కొందరు మనుషులు చక్రాలకి కర్రచుట్లు తయారు చెయ్యడం, పసులకాపర్లు నిప్పు చెయ్యడం గురించి బాలుడు చెప్పాడు ఈ వృత్తాంతాలన్నీ జాగ్రత్తగా విని, తన కుటీరంలోకి వెళ్ళి ఋషి ఒక ముక్కిపోయిన గొడ్డలి తెస్తూ, 'నాతో కూడా రా' అని బాలుడితో అన్నాడు. కొంతదూరం వెళ్ళిన తరవాత ఋషి ఆ బాలుడికి ఓ చెట్టు చూపించుతూ 'దీన్ని నరుకు' అన్నాడు. బాలుడు దాన్ని నరికేశాడు. 'ఈ మొదల్ని మూడింటికెలవ చీల్చు' అని ఋషి ఆజ్ఞాపించాడు. బాలుడు అప్రకారం చేశాడు. ఋషి తన కుటీ

రానికి వెళ్ళి మండుతూన్న కట్టెలుతెచ్చి 'ఆ మూడు దుంగల్నీ తగలబెట్టు' అని బాలుణ్ణి కోరాడు. బాలుడు మంటచేసి, ఆ మూడు దుంగల్నీ కాల్చేసరికి మాడిపోయిన మోడులు మూడు మిగిలాయి. ఒకటి తను పాతి చూపిస్తూ 'సగం నేలలో ఉండే లాగ, ఇల్లాగ, మొండి ముక్కల్ని పాతిపెట్టు' అన్నాడు. బాలుడు అట్లా చేశాడు. ఋషి 'ఆ కొండ మొదట్లో నది కనిపిస్తోంది, చూశావా? ఆ నది నీళ్ళు నీ నోటితో తెచ్చి, ఈ మొండి ముక్కలకి నీళ్ళుపోయ్. ఈ మొదటి దాన్ని, నువ్వు ఆ స్త్రీకి బోధించినట్టు తడుపు. ఈ రెండవదాన్ని నువ్వు ఆ క్రమట్లు చేసేవాళ్ళకి బోధించినట్టు తడుపు. ఈ మూడోదాన్ని నువ్వు ఆ పసులకాపర్లకి బోధించినట్టు తడుపు. ఈ మూడూ వేరుతన్ని ఈ మూడు మాడుమోళ్ళలోంచీ మూడు రేగులు మొలకెత్తినప్పుడు, నీకు తెలుస్తుంది—మానవుల్లోని కీడు నాశనం చెయ్యడం ఎట్లాగో! అప్పుడు నీ పాపాలన్నిటికీ పరిహారం అయిపోతుంది' అన్నాడు. అని అతడు తన కుటీరానికి వెళ్ళిపోయాడు. బాలుడు దీర్ఘకాలం ఆలోచన చేశాడు గాని, ఋషి యొక్క ఉద్దేశం బోధపరుచుగో లేకపోయాడు. అయితేంగనక, చెప్పబడిన రీతిగా చెయ్యడం మొదలెట్టాడు.

X

ఆ బాలుడు నదిలోకి దిగి, నోటినిండా నీళ్ళు పట్టుగుని, వెనక్కి వెళ్ళి ఆ మొదటి మాడుమోడుకి పోసి మళ్ళీ వెళ్ళి వస్తూ, అది పూర్తిచేసి అల్లాగే కడం రెండింటికీ కూడా పోశాడు. అతడికి ఆకలేసింది, అలసట వచ్చింది. ముసలి ఋషి తినడానికి

ఏమున్నా పెడతాడేమో అని అతడు కుటీరానికి వెళ్ళాడు. తలుపు తెరిచేసరికి, ఆ ముసలాయన ఒక బెంచిమీద చచ్చిపోయి ఉన్నాడు. ఆ అబ్బాయి ఆహారం కోసం వెతికి చూశాడు. ఎండ బెట్టిన రొట్టి కనబడితే, కాస్త తిని చూశాడు. తక్షణం ఒక పార పట్టుగుని ఋషిశవాన్ని పాతిపెట్టడానికి గొయ్యి తవ్వడానికి వెళ్ళాడు మొక్కకి నీళ్ళుపొయ్యడం రాత్రివేళ, గొయ్యితవ్వడం పగలు అనుకున్నాడు. గొయ్యితవ్వడం పూర్తిచేసుగుని శవాన్ని అతడు పాతిపెట్టబోయే సమయానికి, పక్క గ్రామంనించి కొంతమంది ముసిలాయన కోసం ఆహారం తెచ్చారు. ముసిలి ఋషి గతించిన సంగతీ, ఆయన తన అభిమానపుత్రుణ్ణి ఆశీర్వదించి తన స్థానంలో ఉంచిన సంగతీ వాళ్ళు గ్రహించడంతోటే, వాళ్ళు తమరు తెచ్చిన ఆహారం అభిమానపుత్రుడికి ఇచ్చెయ్యడమేకాక, ఇంకా తెచ్చిపెడతాం అని వాగ్దానంచేసి, వెళ్ళిపోయారు. ముసిలాయన స్థానంలో అభిమాన పుత్రుడు ఉండి పోయాడు. జనం తెచ్చిపెట్టిన ఆహారం తింటూ, చెప్పబడ్డ రీతిగానే ఆచరిస్తూ, నదిలోంచి నోటితో నీళ్ళుతెచ్చి మాడుమొక్కకి పోస్తూ, అక్కడే జీవిస్తున్నాడు. అల్లా ఒక సంవత్సరం ఉన్నాడు. చాలామంది అతణ్ణి చూడవచ్చారు. ఒక పవిత్ర పురుషుడుట, అడివిలో ఉంటూ, తన ఆత్మని సంరక్షించుగునేటందుకు, కొండ అడుగున ఉన్న నీళ్ళు నోటితో పట్టిగెళ్ళి మాడిపోయిన మొక్కకి పోస్తున్నాడట—అంటూ అతని కీర్తి చాలా వ్యాపించింది. అతడి దర్శనానికి జనం తండోపతండాలుగా వచ్చారు. ధనిక వర్తకులు బళ్ళమీద బహుమానాలు తెచ్చి

ఆయన కిచ్చారు. కాని, ఆయన జీవితావసర పదార్థాలుమాత్రమే స్వంతానికి ఉంచుగుని తక్కినవన్నీ పేదవారికి ఇచ్చేసేవాడు. అభిమానపుత్రుడు ఆరీతిగా జీవించాడు. రోజులో సగం, మోళ్ళకి నీళ్ళమోత, తక్కిన సగం విశ్రాంతి, జనానికి దర్శనం ఇయ్యడం. కీడు నాశనం చేస్తూ తన పాపాలు పరిహరించుగోడానికి చెప్పబడ్డ విధానం ఇదేగావును అని అతడు అనుకోడం మొదలు పెట్టాడు. ఈరకంగా, రెండేళ్ళు, ఏ ఒకరోజూకూడా మోళ్ళకి నీళ్ళుపొయ్యడం మానక, గడిపాడు. అయినాసరే, ఏ ఒక మోడూ పచ్చబడలేదు. ఒకనాడు, అతడు తన కుటీరంలో కూర్చుని ఉండగా, ఒకమనిషి పాడుకుంటూ గుర్రంమీద పక్కనించే వెళ్ళాడు. వెళ్ళేవాడి రకం ఏమిటో కనిపెడదాం అని అభిమానపుత్రుడు బయటికి వచ్చాడు. వాడు మంచి బలం గల యువకుడు. వేషం బాగా ఉంది, గుర్రమూ జీనూకూడా అందంగా ఉన్నాయి.

అభి—ఆగండి. మీ రెవరు? ఎక్కడికి వెడుతున్నారు?

మనిషి—(కళ్ళెపు తాళ్ళు బిగిస్తూ) నేను ఒక బందిపోటుని. పెద్ద రస్తాలమీద గుర్రం ఎక్కి తిరుగుతూ మనుష్యుల్ని చంపేస్తాను. నేను జనాన్ని చంపడం జోరైనకొద్దీ నే పాడేపాటలో హుషారీ ఎక్కువవుతుంది.

అభి—(తనలో) ఔరా! ఇది యెంత ఘోరం! ఇటువంటి మనిషిలో ఉండే కీడు నాశనం చెయ్యడం ఎట్లా? తమరివే తోచి, వచ్చి తమరి పాపాలు ఒప్పేసుగునే వాళ్ళతో ప్రసంగించడం తేలికపనే. కాని, ఏడు తన కీడు చెప్పుగుని విర్రవీగి

పోతున్నాడు కుడానూ! ఏమిటి వీణ్ణి అనడం? ఏమి టిప్పుడు నా కర్తవ్యం? వీడు ఈ ప్రాంతానికి గుర్రంమీద వస్తూంటాడు. జనం బెదిరి పోతూంటారు. వాళ్ళు ఇక్కడికిరావడమే మానారు. వస్తే వాళ్ళకి నష్టం. వాళ్ళు రాకపోతే, నే నెల్లా జీవించడం? (అనుకుని, బందిపోటుకేసి తిరిగి) జనం నాకోసం ఇక్కడికి వస్తూంటారు. కాని, వాళ్ళ పాపాల గురించి వాళ్ళు విరవీగరు. వాళ్ళు చాలా పశ్చాత్తాపపడి క్షమాపణకోసం ప్రార్థిస్తారు. నీ పాపాలకి నువ్వు పశ్చాత్తాప పడు—నీకు దైవభీతి ఉంటే! నీ హృదయంలో పశ్చాత్తాపం లేనే లేదంటావా, వెళ్ళిపో, మరి ఎన్నడూ రా కిక్కడికి, నన్ను బాధించకు. నా దగ్గిరికి వచ్చే జనాన్ని హడల గొట్టకు, ఈ మాటలు వినిపించు గోవా, దేవుడు నిన్ను శిక్షిస్తాడు.

మనిషి—(నవ్వేసి) దేవుడిభయం నాకేమీలేదు. నీ మాటలు నేను చెవిని పెట్టను. నువ్వు నా యజమానివి కావు. నీ సౌజన్యం వల్ల నువ్వు బతుకుతున్నావు, నా బందిపోటుతనంవల్ల నేను జీవిస్తున్నాను. అందరూ జీవించి తీరాలికదా! నీ దగ్గిర ఏమన్నా సంగతులు ఉంటే నీ దగ్గిరికి వచ్చే ముసలమ్మలకి బోధించు. నాకు బోధించతగ్గది నీ దగ్గిర ఏమీలేదు. దేవుణ్ణి గురించి నువ్వు నాకు జ్ఞాపకం చేశావు గనక. రేపు మరో యిద్దరు మనుషుల్ని చంపి తీరతాను, ఈ క్షణంలోనే నా చేతులు పాడుచేసు గోవాలని నాకు లేదు. ఇక ముందు, నా కెప్పుడూ అడ్డురాకు,' అని బెదిరించి, బందిపోటు వెళ్ళిపోయాడు. వాడు మళ్లీ రాలేదు. అభిమానపుత్రుడు, ప్రశాంతంగా, వెనకటిలాగే, మరి ఎనిమిది సంవత్సరాలు అక్కడే వసించాడు.

xi

ఒకనాడు అభిమానపుత్రుడు మోళ్ళకి నీళ్ళోసి, కుటీరానికి వెళ్ళి, విశ్రమిస్తూ, కాలిదారికేసి చూశాడు.— జనం ఎవరేనా తనకోసం వస్తున్నారేమో అని. కాని, ఆ రోజున ఒక్క పిట్టా రాలేదు. సాయంత్రం దాకా, ఒక్కడూ, ఖాగా కూచున్నాడు, ఉసూరుమంటూ, తన పూర్వజీవితం స్మరించుగున్నాడు. మంచి తనం వృత్తిగా చేసుగుని నువ్వు జీవిస్తున్నావ్ అని బందిపోటు వాడు తనని మందలించుండడం తనకి జ్ఞాపకం రాగా, తన జీవితం గురించి అతడు ఆలోచనలో పడ్డాడు. 'ఋషి ఆజ్ఞప్రకారం నేను జీవనం గడపటంలేదు. ఋషి నాకు విధించినది ఒక బాధతోకూడిన శిక్ష. ఆ శిక్ష మూలంగా నాకు భుక్తిగడవడమే కాక, కీర్తికుడా వచ్చింది. ఈ వ్యామోహంలో నేను పడి పోయాను. ఈ వేళ జనం రాకపోయే సరికి నా చురుకు తగ్గిపో యింది. వాళ్లువచ్చి, నా ఋషిత్వాన్ని స్తోత్రాలు చేస్తూంటే, మురిసి పోతున్నాను. జీవించవలిసిన రీతి యిదికాదు. స్తోత్రాల యందుండే వ్యామోహం నన్ను తప్పుదారికి లాగేసింది, నా పూర్వ పాపాలు పరిహరించుగోనేలేదు సరిగదా, కొత్త పాపాలు కట్టుగుంటున్నాను. కనక విధానం మారుస్తాను. అరణ్యంలో మరోచోట నివసిస్తాను—జనం నన్ను మరి కనుక్కోలేరు. పాత పాపాలు పరిహారం అయి కొత్తపాపాలు కట్టుగోకుండా ఉండాలంటే అల్లా నివసించాలి గనక, నివ సిస్తాను' అనుకున్నాడు. ఈ రీతిగా తుది నిశ్చయానికి వచ్చి, అభిమానపుత్రుడు, ఎండు రొట్టె ఒక సంచినిండా వేసి అరెన్నీ

ఒక పారానూ పుచ్చుగుని, కుటీరంలోంచి బయటికివచ్చి తనెను గున్న ఒక లోయకి బయల్దేరాడు. అది వివిక్తంగా ఉండడం చేత అక్కడ ఒక గుహ తవ్వుకుంటే జనం కనపడకుండా దాక్కోవచ్చని అతని అభిప్రాయం. సంచీ, పారా పుచ్చుగుని అతడు నడిచి పోతూండగా, వెనకటి బందిపోటు అతని వెనకాలే గుర్రంమీద వచ్చాడు. అభిమానపుత్రుడు హడిలిపోయి, పరు గెత్తుకుని పారిపో బోయాడు, కాని బందిపోటు అతణ్ణి అందు కున్నాడు, 'ఎక్కడికి వెళుతున్నావు?' అని బందిపోటు అడి గాడు. జనమధ్యంలోంచి లేచి, ఎవళ్ళూ తనని చూడరావడానికి వీల్లేని చోటికి వెళుతూన్నట్టు అభిమానపుత్రుడు బందిపోటుతో చెప్పాడు. ఈ సమాధానానికి బందిపోటు ఆశ్చర్యపడ్డాడు, 'నువ్వెల్లాగయ్యా బతగడం, జనం నిన్ను చూడడానికి రాక పోతే?' అని అడిగాడు. అభిమానపుత్రుడు ఈ మాట ఇంత వరకు ఆలోచించనేనాలేదు, బందిపోటువాని ప్రశ్నవల్ల ఆహారం అవసరమే కదా అనే విషయం అతనికి జ్ఞాపకం వచ్చింది. 'దేవుడు నాకు ఏది ప్రసాదిస్తే, దాన్తో జీవిస్తాను,' అని అతడు సమాధానం చెప్పాడు. బందిపోటు ఏమీ మాట్లాడకుండా గుర్రాన్ని తిప్పి ఘొడు తీశాడు. 'అరెరే! అతడి జీవన విధానం గురించి కొంత అతనితో చెప్పకపోతినే:, అతడు పశ్చాత్తాప పడవచ్చు, ఈ రోజున అతడు నెమ్మదితో కూడిన మన స్థితిలో ఉన్నాడు, నన్ను చంపుతానని బెదిరించలేదు కుడానూ! వెనక్కి పిలుస్తాను' అనుకుని అభిమానపుత్రుడు బందిపోటుని కేకేసి వెనక్కి రమ్మన్నాడు. ఘాడు వచ్చింతరవాత, 'నీ పాపాల

గురించి నువ్వింకా పశ్చాత్తాపపడాలి. నువ్వు దేవుణ్ణి తప్పించుకోలేవు' అన్నాడు. బందిపోటు తన గుర్రాన్ని తిప్పి, తన పటకా లోంచి ఓ కత్తిలాగి అభిమానపుత్రుణ్ణి చంపేస్తానని బెదిరించాడు. అభిమానపుత్రుడు హడిలి బేజారై గబగబా అరణ్యంలోకి పరుగుచ్చుకున్నాడు. బందిపోటు అతణ్ణి వెన్నాడలేదు, గట్టిగా కేకలెట్టాడు; 'ఒరేయ్, అబ్బాయ్! రెండుసార్లు నిన్ను విడిచి పెట్టేశాను. ఈ మాటుగాని నువ్వు నాకు అడ్డు తగిలావా నిన్ను చంపి తీరతాను.' అని, ఈ మాటలు అనేసి, అతడు గుర్రాన్ని పరిగెత్తించుకుని పోయాడు. సాయంత్రం అభిమానపుత్రుడు మోళ్ళకి నీళ్లు పొయ్యడానికి వెళ్ళేసరికి— వాటిలో ఒకటి చిగిర్చి ఉంది! ఒక చిన్న నేపమొక్క బయల్దేరి పెరుగుతోంది!

## xii

అభిమానపుత్రుడు మానవులు కంటపడకుండా దాక్కుని ఒంటరిగా బతికాడు. పట్టిగెళ్ళిన రొట్టెసంచి ఖాళీకాగానే, అతడు, 'నేను ఇప్పుడు వెళ్ళి దుంపలు ఏవైనా దొరుకుతాయేమో చూడాలి, తినడానికి,' అనుకున్నాడు. అతడు అట్టేదూరం వెళ్ళకుండానే ఒక రొట్టెలసంచి ఒక కొమ్మకి వేళ్ళాడుతోంది, ఎల్లా వచ్చిందోగాని! అది తీసుకుని, అందులో రొట్టెలు అయిపోయే దాకా అవి తింటూ కాలం గడిపేశాడు. ఆ సంచీ ఖాళీకాగానే, ఆ కొమ్మకే మరో రొట్టెలసంచి కట్టి ఉండడం అతడు గమనించాడు. తిండిపూచీ గడిచిపోతోంది, బతుక్కుంటూపోతున్నాడు. బందిపోటువాణ్ణి గురించిన భయం ఒక్క ఇతరిబాధ

అతనికేమీలేదు. వాడు ఆ పక్కదారిని వెళ్ళేచప్పుడు వినగానే, తను వెళ్ళి దాక్కుంటూ 'నన్ను చంపేస్తాడేమో, నాపాపాలు ఇంకా నేను పరిహారం చేసుగోకుండానే' అనుకునేవాడు. ఈరీతిగా అతడు పదేళ్ళు నెట్టేశాడు. చిగిర్చిన మోడే చెట్టుగా పెరుగుతోంది కాని, కడం రెండూ మాత్రం యథాతథంగానే ఉండిపోయాయి.

ఒకనాడు పొద్దున్న అభిమానపుత్రుడు పెంద్రాళే లేచి తన పనిమీద వెళ్ళాడు. మోళ్ళకి నీళ్ళు బాగా పుష్కలంగా పోసిం తరవాత, అతడు చాలా అలిసిపోయి, శ్రమతీర్చుగోడానికి కూర్చుని ఆలోచనలో పడ్డాడు: 'నేను పాపాలుచేశాను. ఇప్పుడు మరణం అంటే వెరుస్తున్నాను. నామరణం మూలంగానే నా పాపాలు నేను పరిహరించుగోవాలని దేవుడి ఇచ్ఛయేమో!' అనే మాదిరిగా ఈ ఆలోచన అతడి మనస్సులో కలగడం ఏమిటి, బందిపోటువాడు గుర్రం మీద వస్తూ కనపడడం ఏమిటి. వాడు ఎందుకో ఒట్లు పెడుతున్నాడు. అభిమానపుత్రుడు ఆసంగతి గమనించగానే, 'నాకు కీడు కలిగినా మేలుకలిగినా ఏమానవుడి మూలానూ కలగదు, దేవుడివల్ల కలగాలిగాని' అనుకున్నాడు. బందిపోటుని కలియడానికి వెళ్ళాడు. వాడు ఒంటరిగా రాలేదు. వాడి వెనకాల జీనుమీద మరోడు కూర్చుని ఉన్నాడు. వాడి నోరూ చేతులూ కాళ్ళూ కట్టేసి ఉన్నాయి. వాడేమీ చెయ్యడం లేదు గాని బందిపోటువాడు వాణ్ణి చెడామడా తిట్టేస్తున్నాడు. అభిమానపుత్రుడు వెళ్ళి గుర్రానికి ఎదట నిలబడ్డాడు. ఈమనిషిని ఎక్కడికి తీసిగెడుతున్నావు?' అని అడిగాడు. బందిపోటువాడు:

'అరణ్యంలోకి, వీడు ఒక వర్తకుడి కొడుకు. వీళ్ళనాన్న సొమ్ము దాచిన స్థలం నాతో చెప్పవోయ్ అంటే చెప్పడట. చెప్పేదాకా కొరడాతో ఉతగ్గ దల్చుకున్నాను' అన్నాడు. అని గుర్రాన్ని చెప్పుముల్లుతో గుచ్చగానే, అభిమానపుత్రుడు జీనుపట్టుగుని గుర్రాన్ని కదలనియ్యక 'అతణ్ణి వదిలి పెట్టెయ్' అని కోరాడు. బందిపోటువాడికి కోపంవచ్చి, కొట్టడానికి చెయ్యి ఎత్తాడు. 'వీడి చేత నేను తినిపించ దల్చుగున్న బాపతు నువ్వుకుడా కొంచెం రుచి చూస్తావా ఏమిటి? నిన్ను చంపేస్తానని చెప్ప లేదూ? వదిలెయ్!' అని వాడు కసిరాడు. అభిమానపుత్రుడు భయపడలేదు. 'నిన్ను వెళ్ళనియ్యను. నీ భయం నాకులేదు. దేవుణ్ని తప్ప మరోణ్ని గురించి భయపడను. దేవుడి ఇచ్ఛ నేను నిన్ను వెళ్ళనియ్యకూడదు - అని. ఈమనిషిని వదిలెయ్' అని అతడన్నాడు. బందిపోటుకి చాలాకోపం వచ్చింది. అతడు గభుక్కున ఒక చాకుతీసి ఆ వర్తకపుత్రుడి కట్టుతాళ్ళు తెగ్గోసి పారేస్తూ, 'పొండి, మీ రిద్దరూ కుడా. ఎప్పుడేనా మళ్ళీ అడ్డు వచ్చేరు గనక, జాగ్రత్త' అన్నాడు వర్తకుడి కొడుకు గుర్రం మీంచి దూకేసి పారిపోయాడు. బందిపోటు వెళ్ళడానికి సిద్ధంగా ఉండగా, అభిమానపుత్రుడు అతణ్ని మళ్ళీ ఆపి, కీడుచేసే జీవితం చాలించాలని వాడితో మళ్ళీ చెప్పాడు. బందిపోటువాడు ఆ మాటలు చివరవరకూ నిశ్శబ్దంగా విని మళ్ళీ మాట అనేది ఆడకుండానే దౌడు తీశాడు. మర్నాడు పొద్దున్న అభిమాన పుత్రుడు మోళ్ళకి నీళ్ళు పొయ్యడానికి ఇట్టే వెళ్ళగా—ఆశ్చ ర్యం! రెండో మోడు చిగిర్చి ఉంది. చిన్న రేగుచెట్టు, రెండోది, తయారౌతోంది.

## xiii

మరో పదేళ్ళు గడిచాయి. ఒకనాడు అభిమాన పుత్రుడు ప్రశాంతంగా, ఏ కోరికా లేకుండా ఏ భయమూ లేకుండా ఆనంద పూరితమైన హృదయంతో కూర్చున్నాడు. అతడు, 'దేవుడు మానవులమీద ఎన్నెన్ని సౌఖ్యాలు కురిపిస్తూంటాడోగదా! అయినాసరే, అనవసరంగా మానవులు ఒకళ్ళ నొకళ్ళు ఎంత క్షోభ పరుచుగుంటూ ఉంటారోగదా! వాళ్ళు సుఖంగా జీవించ కుండా అడ్డుపడుతూన్నది ఏమిటో?' అని అనుకున్నాడు. మానవుల్లో ఉండే కీడూ, దానిమూలాన్ని తమరి మీదికి తమరే తెచ్చుగునే కష్టాలూ తెచ్చుగునే టప్పటికి, అతని గుండె జాలితో కరిగిపోయింది. 'నేను ఈ రీతిగా జీవిస్తూ ఉండిపోవడం తప్పు. నేను వెళ్ళి నేను నేర్చుకున్నది ఇతరులకి బోధించాలి' అని అత డనుకున్నాడు. ఈ ఆలోచన ముగిసిందో లేదో, బందిపోటు వాడు వస్తూన్న చప్పుడు అతనికి వినబడింది. అతడు ఆ బంది పోటుని పక్కనించి దాటిపోనిస్తూ, 'ఇతడితో మాట్లాడిన లాభం ఏమీలేదు. ఇతడు ఎన్నటికీ గ్రహించడు' అనుకున్నాడు. ఇది అతని మొదటి సంకల్పం. కాని, వెంటనే అతడు తన మనస్సు మార్చుగుని బయటికి రోడ్డుమీదికి వెళ్ళాడు. బందిపోటువాడు విచారగ్రస్తుడై దించిన దృష్టితో గుర్రంమీద ఉన్నాడు. అభి మాన పుత్రుడు అతణ్ణి చూసి, జాలిపడి, దగ్గిరికి పరిగెత్తి అతని మోకాలిమీద తన చెయ్యి ఉంచాడు. అతడు, 'ప్రియసోదరా! నీ ఆత్మమీద నువ్వు కొంచెం జాలి వహించు! నీలో దేవుడి అంశ ఉంది. నువ్వు బాధపడి, ఇతరుల్ని క్షోభపెట్టి, భావి

కాలానికి ఇంకా ఎక్కువ బాధ పేరుస్తున్నావు. అయినాసరే, దేవుడు నిన్ను ప్రేమించి, నీకోసం సకల సౌఖ్యాలూ సిద్ధంచేసి ఉంచాడు. నిన్ను నువ్వు సర్వనాశనం చేసుగోకు. జీవితం మార్చుగో!' అని బతిమాలుకున్నాడు. బందిపోటువాడు కోపగించి, మొహం తిప్పేసు గున్నాడు. 'నన్ను వదిలేసెయ్యండి' అన్నాడు. కాని, అభిమానపుత్రుడు అతణ్ణి మరీ గట్టిగా పట్టుగుని వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టాడు. అప్పుడు బందిపోటు వాడు తన దృష్టియెత్తి అభిమానపుత్రుణ్ణి చూశాడు. ఆ చూడడం చూడడం చాలాసేపు చూశాడు. చూసి, గుర్రం దిగి, అభిమాన పుత్రుడి పాదాలమీద మోకరించాడు. 'అయ్యా! నన్ను మీరు జయించారు. ఇరవైయేళ్ళనించి మిమ్మల్ని ప్రతిఘటిస్తున్నాను. కాని, ఇప్పుడు మీరు నెగ్గేశారు. మీరు నన్ను ఏమిచేసినా సరే చెయ్యండి ఏమంటే! ఇప్పుడు నామీద నాకే మీశక్తిలేదు. మొదట మీరు నన్ను మార్చ దల్చుకున్నప్పుడు, నాకు కోపం మరీ రేగింది. జనసాయం కోరకుండా మీరు దాక్కున్నప్పటి నించే, మీరన్న మాటలు నేను సరిగా గ్రహించింది. ఎందుకంటే! వాళ్ళ దగ్గిర్నించి మీస్వంతానికి మీరేమీ కోరడంలేదని నాకప్పుడు తెలిసింది. ఆదినం మొదలు మీకు నేను ఆహారం తెచ్చిపెట్టి, కొమ్మకి కట్టేసేవాణ్ని' అన్నాడు. అప్పుడు అభిమానపుత్రుడికి జ్ఞాపకం వచ్చింది! ఆ స్త్రీ తన బల్ల సుబ్బరం చెయ్యడానికి ముందు అందుకు ఉపయోగించే మురికి గుడ్డ సుబ్బరంగా చెయ్యడం. ఆరీతిగానే, తనని గురించిన చింత తను మానుకుని, తన హృదయం సుబ్బరం చేసుగున్న తరవాతే తను

వెళ్ళి ఇతరుల హృదయాలు సుబ్బరం చెయ్యడం గదా, బందిపోటు ఇంకా ఏమన్నాడంటే: 'మరణం గురించి మీ రెప్పుడు భయపడలేదో, అప్పుడు నా హృదయం తిరిగిపోయింది' — అని. దాంతో అభిమానపుత్రునికి జ్ఞాపకం వచ్చింది; చక్రాలకి కర్ర చుట్లు వేసేవాళ్ళు దిమ్మని స్థిరంచేసేవరకూ కర్రని వంపలేక పోవడం. అలాగే, మరణభయం దూరంగా విసిరేసి, దేవుడిలో జీవిత స్థిరత్వం కుదుర్చుకుంటేనే, బందిపోటువాని లొంగని హృదయాన్ని స్వాధీనపరుచుకోగలగడం జరిగింది గదా! అని ఆ బందిపోటు ఇంకా మాట్లాడుతూ, 'కాని, నా హృదయంపూర్తిగా కరగలేదు——నన్ను చూసి మీరు జాలి వహించి, నన్ను గురించి వెక్కి వెక్కి ఏడ్చేవరకూ' అన్నాడు. అభిమానపుత్రుడు ఆనంద భరితుడై మోళ్ళున్న చోటికి బందిపోటుని తీసికెళ్ళాడు. అక్కడికి వీళ్ళు వెళ్ళేసరికి, పరామాశ్చర్యం, ఆ మూడో మోడుకుడా చిగిర్చి ఉంది. అప్పుడు అభిమానపుత్రుడికి జ్ఞాపకం వచ్చింది; పసుల కాపర్లు, పైన వేసిన తడికట్టెలు మండుతా ఎప్పుడు? చిదుగులు బాగా అంటుకుని మండిన తరవాతేగదా——అని. అల్లాగే తన హృదయం వేడెక్కి దహించుకుపోతూన్న తరవాతనే ఇతరుడి హృదయానికి నిప్పు అంటుగుని జ్వాలకావడం!

తన పాపాలు పరిహారం అయినందుకు అభిమానపుత్రుడు పొందిన ఆనందానికి మేరలేదు. బందిపోటువాడితో ఇదంతా చెప్పి అభిమానపుత్రుడు మరణించాడు. ఆ బందిపోటువాడే అతడికి సమాధిచేసి, అతడు ఆజ్ఞాపించిన రీతిగా జీవితం గడుపుతూ, అతడు తనకు చేసిన బోధ ఇతరులకి తాను చేస్తూ ఉండిపోయాడు.

— —

# నిష్ఠురవ్వని నిర్లక్ష్యం చేస్తే కొంప లంటుగు పోతాయి

(అప్పుడు పేతురు ఆయన్ని సమీపించి, 'ప్రభూ! సాటి పోచకుడు నాకు కీడుచేస్తూంటే ఎన్ని సార్లని నేను క్షమించుతూ కూర్చోనూ? ఏడుసార్లా?' అన్నాడు. యేసు అతనితో, 'ఏడు సార్లనికాదు నీతో నే ననేది. ఏడుకి డెబ్భైసార్లు. అందుకనే, స్వర్గరాజ్యాన్ని నౌఖర్లతో జమాఖర్చులు చూసుగునే రాజుతో పోల్చారు. అల్లా లెఖ్ఖలు చూడడం ప్రారంభించగానే, ఆయనకి పదివేలు బాకీఉన్న ఒక అతణ్ణి ఆయన యెదటికి తీసుగు వచ్చారు. వసూలివ్వడానికి అతనికి అస్కారం బొత్తిగా లేక పోయిన కారణంచేత, అతణ్ణీ, అతడి భార్యనీ పిల్లల్నీ అతడి యావత్తునీ అమ్మేసి వచ్చింది చెల్లకట్టండని రాజుఆజ్ఞ ఇచ్చాడు. అప్పుడు సేవకుడు వచ్చి రాజు కాళ్ళమీదపడి, ఆయన్ని ఆరాధించి, 'ప్రభూ! కొంచెం ఓపికపట్టండి. బాకీఅంతా చెల్లిస్తాను' అని మొరపెట్టుగున్నాడు. ఆ సేవకుడి యజమాని అయిన ఆ రాజు మనసుకరిగి కనికరం దాల్చి, అతణ్ణి విడుదలచేసి ఋణ విముక్తుణ్ణిగా చేశాడు. కాని, తక్షణం ఆ సేవకుడు వెళ్ళి, తనకి ఓ వందకాన్లు బాకీఉన్న ఒకసాటి సేవకుణ్ణి పట్టుగుని, నిలబెట్టి, గొంతుగ పట్టుగుని 'నా బాకీ అక్కడ కక్కు' అన్నాడు. ఆ సాటి సేవకుడు ఇతడి కాళ్ళమీదపడి వేడుకుంటూ, 'కొంచెం ఓపికపట్టు. బాకీ తప్పకుండా చెల్లిస్తాను' అన్నాడు. కాని,

ఇతడా మాట వినిపించుగోక, వెళ్ళి బాకీ పూర్తిగా తీర్మానం పెట్టేవరకూ ఖైదువేయించి అతణ్ణి ఖైదులో పడెయించాడు. తక్కిన సేవకులు ఈ చర్యంతా చూసి, చాలా దుఃఖించి, తిన్నగా వెళ్ళి తమ యజమానితో చెప్పారు. అప్పుడు యజమాని ఆ మొదటి సేవకుణ్ణి పిలిపించి, 'ఓరీ, నువ్వు దుష్టసేవకుడవు. నీ బాకీ అంతా నేను రద్దుచేశాను' నువ్వు నన్ను వేడుకున్న కారణంచేత. అలాగే ఆ సాటి సేవకుడిమీద నువ్వుకుడా కనికరం చూపించి ఉండద్దూ, నేను నీ మీద కనికరం చూపించినట్టుగానే, అన్నాడు. ఆయనకి కోపంవచ్చి ఆ సేవకుణ్ణి హింసకులికి అప్ప గించాడు, తన బాకీ ఛీదాగా తీర్మానం పెట్టేవరకూ! స్వర్గ రాజ్యంలో ఉండే నా జనకుడు కుడా, సాటి సోదరుణ్ణి హృదయ పూర్వకంగా క్షమించని ప్రతి మనిషినీ అట్లాగే చేస్తాడు—మత్తయి **xviii** 21—35)

పూర్వం ఒక గ్రామంలో ఇవాన్ అనే రైతు ఉండేవాడు. అతడు చాలా మంచి స్థితిలో ఉన్నాడు. మంచి నడివయసులో ఉన్నాడు, ఊళ్ళోకల్లా ఉత్తముడైన పనివాడు. అతని ముగ్గురు కొడుకులూ కుడా పనివాళ్లు. పెద్దవాడి పెళ్ళి అయింది. రెండో వాడు పెళ్ళిచేసుగోడానికి సిద్ధంగా ఉన్నాడు, మూడోవాడు కుర్ర వాడైనా ఎర్తరిగా ఉండి గుర్రాల్ని కాయడమేకాక అప్పుడే నాగలి పట్టుగోడం కుడా ప్రారంభించాడు. ఇవాన్ భార్య సమర్థు రాలు, పొదుపుమనిషి నోరు మూసుగుని కావలసినంత చాకిరీ చేసే కోడలు కుడా దొరకడం వాళ్ళఅదృష్టం. ఇవాన్ కుటుంబం యొక్క సౌఖ్యానికి అడ్డు ఏదీలేదు. ఒక్క సోమరినోటికిమాత్రం

వాళ్లు తిండి పడెయ్యవలసి వొచ్చింది. ఆ సోమరి ఎవరంటే, ఇవాన్ ముసిలితండ్రి. అతడికి క్షయ. అందుచేత ఏడేళ్లగా అతడు ఇటకపొయ్యిమిద్దెమీదే మకాం. ఇవాన్‌కి కావలిసినవన్నీ ఉన్నాయి—మూడు గుర్రాలు, ఒక గుర్రపుపిల్ల, దూడతోసహా ఆవు, పదిహేను గొర్రెలు. మొగాళ్ళు పొలాలు దున్నితే, ఆడ వాళ్లు అవసరమప్పుడు పొలంపనిలో సాయపడుతూ, ఇంటిదగ్గిర సంసారానికి సరిపడ బట్టలపని యీనత్తూ నిత్యమూ చేసేవారు. పన్నులు కట్టడానికీ ఇతర అవసరాలకీ వాళ్ళు కొంత ధాన్యం అమ్మినా, తరవాతపంటకాలం దాటిపోయేదాకా కావలసిన స్వంత ధాన్యం వాళ్ళకుండేది. ఇవానూ కుటుంబమూ ఎంత సుఖంగా నేనా గడపవలసింది కాలం—తమ పక్కింటిపొరుగువాడున్నూ గార్డే కుమారుడున్నూ అయిన కుంటి గేబ్రియల్‌కీ తమకీ లడాయి పడకుండా ఉండి ఉంటే. గార్డే జీవించి ఉండీ, ఇవాన్ తండ్రి తన యింటి వ్యాపారం తనే నిర్వహించుకో గలిగినంత కాలం, ఆరైతులు ఇరుగుపొరుగులు ఉండవలిసినట్టు ఉండేవారు. ఒక యింటి స్త్రీలకి ఏ జల్లెడో ఏ తొట్టో కావలిసొచ్చినా, లేక పోతే మొగాళ్ళకి ఏ సంచీయో అవసరమైనా, లేకపోతే ఏబండి చక్రమైనా విరిగి మరమ్మతు చెయ్యడం తక్షణం పడకపోవడం వల్ల లోటొచ్చినా, పక్కయింటికి కబురంపేవారు, స్నేహ భావంలో వారు సాయం చేసేవారు. ఒకరి దూడ ఏదేనా తిరు గుతూ పక్కవారి కళ్ళంలోకి జొరబడితే, వాళ్ళు దాన్ని దూరంగా తోలెయ్యడం మాత్రం తోలేసి, యజమానితో, 'ఆ దూడని మళ్ళీ ఇక్కడికి రానీకండి. ఇక్కడ ధాన్యం ఉంది.' అని చెప్పేవారు.

మరి గాదెలకీ పెరటియిళ్ళకీ తాళాలు పెట్టడ మనగా, వస్తువులు దాచెయ్యడ మనగా, వెనకాల తాటాకులు కట్టడ మనగా. మొదలైన పన్లు అ రోజుల్లో ఎవరికీ తోచనేలేదు. తండ్రులకాలంలో స్థితి అది. ఇక కొడుకులు కుటుంబాల యజమానులు కాగానే సమస్తమూ మారిపోయింది.

గొడవ అంతా ఒక అత్యల్ప విషయంతో ఆరంభమైంది.

ఇవాన్ కోడలికి ఒక కోడిపెట్ట ఉంది. అది కార్తెలో కొంత పెందరాళే గుడ్లు పెట్టడం మొదలెట్టింది. రాబోయే ఈస్టరు పండగకి ఆవిడ గుడ్లు పోగుచేసుగుంటోంది. ప్రతిరోజూ ఆవిడ బండిసాలలోకి వెళ్ళి చూస్తే బండిలో ఒక గుడ్డు ఉండేది. ఒక ఒకనాడు అ పెట్ట, బహుశా పిల్లలు బెదరగొట్టారుగావును, సరిహద్దు డొంకలోంచి ఎగిరి పక్క ఇంటివారి దొడ్లోకివెళ్ళి, గుడ్డు అక్కడ పెట్టింది. ఆవిడకి దాని కూత వినపడింది గాని, ఆవిడ తనలో, 'ఇప్పుడు చెయ్యి ఊరుకోలేదు. ఆదివారంనాటికి ఇంటి బాగులన్నీ కావాలి. తరవాత వెళ్ళి తెచ్చుగుంటాను, గుడ్డు!' అనుకుంది. సాయంత్రపువేళ ఆవిడ బండివగ్గిరికి వెళ్ళి చూస్తే, అక్కడ గుడ్డులేదు. ఒకవేళ తీస్తే తీశారేమో అని అత్తగార్నీ మరిదినీ అడిగింది. వాళ్లు తియ్యలేదు అన్నారు. కాని, ఆవిడ చిన్నమరిది, 'నీ పెట్ట, గుడ్డు పెడతా పక్కయింటివారి దొడ్లో, పడినా. అక్కడా అది చూస్తా, తరవాత ఎగురుతూ డొంకలోంచి వెనక్కి వచ్చేసింది' అని చెప్పాడు. ఆవిడ వెళ్లి పెట్టచేసి చూసింది. వడం పిట్టలతోపాటు అది కుడా దిమ్మమీద కులుకుంది, దానికి అప్పుడే కళ్ళమూతలు పడుతూ నిద్దరవస్తూ

ఉంది. ఆ పిట్టనే తను అడగ గలిగి సమాధానం తియ్యగలిగితే తీరిపోనుగదా అని ఆవిడ అనుకుంది. తరవాత, ఆవిడ పక్కింటికి వెళ్ళింది, గ్రేబియల్‌తల్లి ఆవిణ్ణి కలుసుగోడానికి బయటికి వచ్చింది. 'ఏంకావాలి, కోడలుపిల్లా?' అని అడిగింది. ఆవిడ ముసిలమ్మతో. 'అబ్బే, ఏంలేదు తాతమ్మా! నా పెట్ట ఉంది చూడూ, అది పొద్దున్న ఎగిరి కంచెలోంచి మీ దొడ్డోకివచ్చింది. అది ఇక్కడ గుడ్డు పెట్టలేదూ?' అంది. ముసలమ్మ, 'ఏమో! గుడ్డుకాదు సరిగదా గుడ్డుతో ఒకతేళమైనా మేం ఎన్నడూ చూడలేదు. దేవుడి దయవల్ల, మా స్వంత పెట్టలు గుడ్లు పెట్టడం మొదలెట్టి ఎంతోకాలం అయింది. మా గుడ్లే మేం పోగుచేసుగుంటాం. అడ్డమైనవాళ్ళ గుడ్లూ మాకవసరమూలేదు. మరి మా గుడ్లకోసం అంటూ ఇతరుల దొడ్లల్లోకి మేం వెళ్ళావెళ్ళం. విన్నావా, పిల్లా?' అంది. ఆయువతికి కష్టంతోచి తను అనవలిసిన మాటలకంటె జాస్తీగా అనేసింది. ముసిలమ్మ వడ్డీతోసహా ముట్టచెప్పేసింది. అక్కణ్ణించి వాళ్ళిద్దరూ ఒకర్నొకరు తిట్టుగోడం మొదలెట్టారు. ఇంటికి నీళ్ళు పట్టిగెడుతూన్న ఇవాన్‌భార్య ఈ క్షణానికే అక్కడికి రావడం తటస్థించగా, తనుకూడా ఇందులో కలిసింది. గ్రేబియల్ భార్యబయటికి చొరబడి, యథార్థంగా జరిగిన విషయాలతో స్వప్నేపి జరిగుండని విషయాలు గుచ్చెత్తి, ఆ యువతిని తిట్టెయ్యడం మొదలెట్టింది. మూకఉమ్మడి గందరగోళం ప్రారంభమైంది. అందరూ ఒకే క్షణంలో అరుస్తూ ఒక్కొక్కసారే రెండేసిమాటలు అనేసెయ్యాలని యత్నించారు—ఆమాటలైనా అనాఖిరా రానివి. 'నువ్విల్లాంటిదానివి', 'నువ్వ

ల్లాంటి దానివి.' 'నువ్వు దొంగరకం', 'నువ్వు రంకుపీనుగువి;' 'నీ ముసిలి మామగారిన్ని నువ్వు కడుపు మాడిచి చంపుతున్నావు. పోవే.' 'నువ్వు గవ్వచెయ్యవు. పోవే. పనికిమాలినదానా.' 'పోనీ అని చెప్పి ఓ మాటు జల్లెడ బదులిస్తే, దానికి కన్నం పెట్టి యిచ్చావు పోవే ఊరిదానా!' 'మీరు నీళ్ళు తెచ్చుగుంటూ ఉంటా మా కావిడిబద్దతోటే, తక్షణం మాకావిడిబద్ద మాకిచ్చెయ్.' మొదలైనవి చెలరేగి పోయాయి. అంతా ఆకావిడిబద్ద పట్టుగుని దాన్ని విరిచేశారు, నీళ్ళు ఒలకపోశారు. పైకండువాలు లాగేసు గున్నారు, కొట్టుగోడంలో పడ్డారు. పొలాన్నుంచి వస్తూ గేబ్రియల్ ఆగిపోయి భార్య తరపున కాసుగున్నాడు. రైయింమంటూ ఇవానూ కొడుకూ వచ్చి దొమ్మీలో ప్రవేశించారు. ఇవాను బలాసి. అతడు ఒక్క దెబ్బని వాళ్ళందర్నీ చెదరగొట్టి, గేబ్రియల్ గడ్డం బాపతు ఓ గుప్పెడు వెంట్రుకలు పీకీపారేశాడు. సంగతేమిటో చూడడానికి జనం మూగేశారు. బ్రహ్మాండంమీద కొట్టుగునే వాళ్ళని ఎడంగా మోశారు.

కలహం ఈమోస్తరుగా అంకురించింది.

పీకిపారేసిన గడ్డపు వెంట్రుకలు ఏరి, గేబ్రియల్, పొట్లంకట్టి ఇవాన్ మీద ఛార్జీ ఇయ్యడానికి తిన్నగా జిల్లాకోర్టుకి వెళ్ళాడు.

'నేను గడ్డంపెంచుగుంటా ఈ ఇవాన్‌గా దొచ్చి పీకెయ్యడానికా, మొహం నిండా గుంటలూ పీడూనూ?' అనుకుంటూ గేబ్రియల్ కసిలో పడ్డాడు. అతని భార్య ఇరుగు పొరుగుతో తమ గొప్ప చెప్పుగుంటూ ఇవాన్‌కి శిక్ష వెయించి అతణ్ణి దేశాంతరం పంపించేస్తాం అంబోచ్చింది. ఇల్లాగా కలహం

నిమ్మళంగా పెరిగింది. ముసలివాడు ఆ వేడిమిద్దె మీదినించే మాట్లాడుతూ ఎల్లాగేనా సఖ్యత పడండర్రా అని నచ్చచెప్పడానికి యత్నించాడు, కాని అతడి మాటలు వాళ్ళు వినిపించుగోలేదు. అతడన్నది ఏమిటంటే, 'బిడ్డల్లారా! మీరు ఒక బుద్ధి తక్కువ విషయాన్ని వెంటాడుతున్నారు. బహు అల్పమైన సంగతి గురించి దెబ్బలాటలు లేవదీసుగుంటున్నారు. కాస్త ఆలోచించండి. ఇంతా జరుగుతా ఒక గుడ్డుని గురించి. అది పిల్లలెవరేనా తీసుగున్నారేమో! పోనీ తీసుగోనీండి. తీసుగుంటే ఏం కొంపమునిగిపోయింది? గుడ్డుయొక్క విలవ ఏపాటి? దేవుడు అందరికీ సరిపడ ప్రసాదిస్తాడు గదా! మీ పక్కింటి అపిడ పోనీ అగౌరవంగా మాట్లాడిందే అనుకోండి. ఆవిడమాట రీతి సరిదిద్దండి అంతకంటె ఎక్కువ మర్యాదగా మాట్లాడ్డం నేర్పండి. ఈ పాటికి మీ రసలు కొట్టుగుని ఉన్నా—ఎక్కడికి దీనికీ, అల్లాంటివి జరుగుతూనే ఉంటాయి. మనం అంతా పాపులమే. ఇక్కడే రాజీపడిపోతే, పాపం అక్కడితో అంతం అవుతుంది. మీ కోపాన్ని మీరు పెంచితే, అది చివరకి మీకే మరీ విషమిస్తుంది.' అని. కాని, కుర్రకారు అదంతా వార్ధకానికి మామూలైన అతని బుద్ధిమాంద్యం అనుకున్నారు. ఇవాన్ చూస్తూ చూస్తూ పక్కింటి వాడికి లొంక్కిపించు గోడానికి ఒప్పుగ్గుంటాడా? 'నేను వాడి గడ్డం ఎన్నడూ పీకలేదు. వాడే కొంత మూర పీకేసున్నాడు. కాని, వాడి కొడుకువచ్చి నా చొక్కా కుట్లన్నీ ఊడి ఏముక్కకి ఆముక్క వచ్చేలాగ చీరిపారేశాడు. ఛూడండి చొక్కా ఎల్లా అయిందో!' అంటూండి. తనూ కోర్టుకి

వెళ్ళాడు. మొదట మేజిస్ట్రేటూ తరవాత జిల్లాజడ్జీ తగాదా విచారణ చేశారు. ఇదంతా జరుగుతూన్న రోజుల్లో గేబ్రియల్ బండీకి ఉండే శాయిమేకు మాయమైంది. అది ఇవాన్ కొడుకు చేసినపనే అయుంటుందని ఆరోపిస్తూ గేబ్రియలింటో ఆడవాళ్ళన్నారు. పైగా, 'మన కిటికీ ముందునించి ఆ బండి దగ్గిరికి ఆ అబ్బాయి రాత్రి వెడుతూండగా చూశాం. ఒక పొరుగాయన ఆ అబ్బాయి హోటలుకి వెళ్ళి ఆమేకు యజమానికి అమ్మచూపాడట' అన్నారు కుడానూ. ఆ విషయంగురించి వాళ్ళు కోర్టుకి వెళ్ళారు. ఇంటి దగ్గిర ఏ ఘర్షణో ఏ దెబ్బలాటో లేకుండా ఉండే రోజంటూ లేదు. పిల్లలు, పెద్దవాళ్ళని చూసినేర్చుగుని, తత్ప్రకారంగా తిట్టుగునేవారు. ఇక, ఆడవాళ్ళు బట్టలు ఉతుక్కోడానికి కాలవవైపు వెళ్ళి ఒకరి కొకరు ఎదురవడమే తటస్థించిందా, వాళ్ళు చేతుల్తో పిండడం పనికంటె నాలికల్తో దెప్పడం పనే ఎక్కువగా ఉండేది—అందులో మళ్ళీ ప్రతిమాటా పాడుగా ఉండే మాటల్తో!

మొదట్లో ఆరైతులు ఒకర్ని ఒకరు యాగీచేసి ఊరుకునేవారు. కాని, తరవాత చేతి పీలునిబట్టి అవతలవాళ్ళ వస్తువులు కొట్టెయ్యడం బుద్ధిపూర్వకంగా ప్రారంభించారు. పిల్లలు తమ పెద్దల ఒరవడి అవలంబించారు. అందరికీ కుడా జీవితం మరీ మరీ కష్టతరం అయింది. ఇవానూ కుంటిగేబ్రియలూ ఒకరిమీద ఒకరు ఛార్జిలిచ్చుగుంటూనే ఉన్నారు—గ్రామసభలో, బెంచి కోర్టులో, జిల్లాకోర్టులో, అన్నిచోట్లా. దాంతో న్యాయమూర్తులందరికీ వీళ్ళంటే విసిగెత్తిపోయింది. ఒకసారి గేబ్రియలు

ఇవానుకి జరిమానాగాని ఖైదుగాని వెయిస్తే, మర్నాటి ఇవాను గేబ్రియలుకి అంతా చెయించేవాడు. వాళ్ళద్వేషాలు పెరిగినకొద్దీ వాళ్ళకోపాలు తీవ్రతరం అయినాయి, కలబడ్డ కుక్కలు దీర్ఘంగా పోరినకొద్దీ వాటి ఆగ్రహాలు విజృంభించినట్టు మనం వెళ్ళి ఓ కుక్కని వెనకాల్నించి కొట్టాం అనుకోండి, ఆ కొట్టింది యెదరకుక్కే అనుకుని అది మరీ భయంకరంగా తయారవుతుంది. ఈ రైతులూ అంతే. ఎప్పుడూ ఛార్జీతే. ఎవడికో ఒకడికి జరిమానా, లేకపోతే ఖైదూ. అందువల్లే ఒకడిమీద మరొకడికి కోపం ఇంకా ఇంకా హెచ్చుతూండేది. 'చూస్తూండరా, ఇందుకు తగ్గశాస్తి నీకు చెయిస్తానూ!' అని ప్రతీవాడూ అంటూండడం. అల్లాగ్గా వీళ్ళవైరం ఆరేళ్ళు సాగింది. వేడిమిద్దెమీద పడుకున్న ముసిలాయన మాత్రం అంటూనే ఉండేవాడు, 'ఒరేయి, అబ్బాయిల్లారా, ఏమిట్రా మీరు చేస్తూన్నదీ? ఈ ముట్టచెప్పడాలు మానెయ్యండ్రా. మీపని మీరు చూసుగోండి. ఇతరులకి హాని చెయ్యాలనే బుద్ధి పెట్టుగోకండి. ఊరుకుంటే, మీకే శ్రేయస్కరం అసలు. కాదు, హాని చెయ్యాలనే పెట్టుగుంటారా, అది మీకే క్షోభకరం,' అని.

కాని, అతని మాటలు వాళ్ళు వినిపించుకునేవారు కారు.

ఏడో సంవత్సరంలో, ఒక వివాహ సందర్భంలో, ఇవాన్ కోడలు 'గుర్రాన్ని తస్కరించుగు పోతూంటే బరిమీదపట్టుగున్నారట గేబ్రియల్‌ని,' అంటూ ఆతడినేరంబయట పెట్టి అతణ్ణి అవమానానికి గురిచేసింది—గేబ్రియల్ అప్పుడు మూంచి తోసుమీద ఉన్నాడేమో, కోపం ఉండబట్టలేక, ఆవిణ్ణి దిమ్మదిరిగేటట్టు

కొట్టేసరికి. ఆవిడ ఓ వారం రోజులు మంచం పట్టింది. ఆవిడ అప్పుడు కడుపుతూ ఉందికుడానూ. ఇందుకు ఇవాన్ సంతోషించాడు. అతడు తక్షణం మేజిస్ట్రేటు దగ్గిరికి ఫిర్యాదు దాఖలు చెయ్యడానికి వెళ్ళాడు. 'అమ్మ! ఇక ఈ పొరుగువాణ్ణి విరగడ చేసుకుంటాను బాబూ. వీడు ఎల్లా తప్పించుకోగలడూ, ఖైదో లేకపోతే దేశాంతరవాసమో!' అనుకుని సంబరపడ్డాడు. కాని, అతని ఆశ నెరవేరలేదు. ఆ అధికారి కేసు కొట్టేశాడు. ఏమంటే: తీరా ఆవిణ్ణి విచారణకి పెట్టగా, ఆవిడ చలాకీగా తిరుగుతూన్నట్టే తేలిందిగాని, దెబ్బలుతిన్న సూచన ఏమీలేదు. అక్కణ్ణించి, ఇవాను బెంచికోర్టుకి వెళ్ళాడు ఆ న్యాయమూర్తి ఈకేసు జిల్లాకోర్టుకి పంపుగున్నాడు. ఇవాను చురుగ్గా పనిచేశాడు. వెళ్ళి, అక్కడి గుమాస్తాకీ ఆ కోర్టు పెద్దకీ ఓ గాలను సారా పోయించి గేబ్రియల్‌కి దెబ్బలశిక్ష వెయించాడు. గుమాస్తా ఆ శిక్ష గేబ్రియలుకి చదివి వినిపించాడు, 'కోర్టువారి తీర్పు ప్రకారం, గేబ్రియల్ గార్డే అనే రైతు, జిల్లాకోర్టు ఆవరణలో ఇరవై కర్ర దెబ్బలు తినాలి'—అని. ఆ శిక్షా వాక్యం ఇవాను కుడా విని, గేబ్రియలుకేసి చూశాడు—ఆ శిక్షని గేబ్రియలు ఎల్లా గణిస్తాడో కనిపెట్టాలని. గేబ్రియలు మొహం తెల్లగా, కాగితంలాగ, పాలిపోయింది. అతడు గిర్రుని తిరిగి నడవలోకి వెళ్ళాడు. ఇవాను వెనకాలే వెళ్ళాడుగాని, తన గుర్రానికి సదుపాయంచూసి వచ్చేటందుకే, పాపం. తన వెనకాలే ఇవాను రావడం తెలియక గేబ్రియలు అనేసిన మాటలు, 'సరే సరే. ఇప్పుడు నా వీపు కొరడాతో వాడు బాదిస్తాడు, ఆ దెబ్బలకి నా వీపు మండుతుంది.

కాని, వీడి తాలూకు ఎదో అంతకంటె ఘోరంగా ఉండవచ్చు!' అనేపి ఇవాను విన్నాడు. విని. అతడు వెనక్కి కోర్టుభవనం లోకి తక్షణం వెళ్ళి 'సమర్థులైన న్యాయమూర్తులారా: గేబ్రియల్ నా కొంప తగలపెడతాడట, వినండి, సాక్షుల సమక్షంలోనే అన్నాడా మాటలు' అని చెప్పుగున్నాడు.

గేబ్రియల్‌ని వెనక్కిపిల్చి, అల్లా అన్నాడేమో కనుక్కున్నారు. 'నే నేమీ అనలేదు. అధికారం మీదిగనక, నన్ను బాదండి. నేను ధర్మపక్షంలో ఉండడంనించి కదా ఇంత బాధా నేను మాత్రమే పడడమూనూ వాడిష్టం చొప్పున వాడుండడానికి మీరు అంగీకరించడమూనూ అన్నట్టు కనిపిస్తోంది' అని, గేబ్రియలు ఇంకా కొంత చెప్ప దల్చినా, అతని పెదవులూ దవడలూ వణికిపోవడంవల్ల, అతడు గోడకేసి మొహం పెట్టేసుగున్నాడు. అతడి చూపులకి ఉద్యోగులందరూ హడిలిపోయి, 'ఇతడు తనకేనా ప్రమాదం తెచ్చుగుంటాడు లేక పక్కవాడికేనా ప్రమాదం తెస్తాడు' అనుకున్నారు. అప్పుడు ఆ ముసిలి న్యాయాధికారి, 'చూడండి, అబ్బాయిలూ! మీరు బుద్ధి ప్రయోగించి సఖ్యతపడడం నయం. ఏమయ్యా నేస్తం గేబ్రియల్! గర్భిణీస్త్రీని కొట్టడం నీకు ధర్మమేనా? అయినా, అది చాలా సవ్యంగా గడిచిపోవడం ఎంతో అదృష్టం. కాని, ఆ క్షణంలో ఏమిజరిగి ఉండవచ్చునో తల్చుగో, ఒక్కసారి. అది ధర్మమా? అందుకని, తప్పు ఒప్పేసుగుని అతని క్షమాపణ వేడుకోవడమే నీకు మంచిది. అతడు క్షమించేస్తాడు. మేం శిక్ష మార్చేస్తాం' అన్నాడు. కాని గుసూస్తా తః మాటలువిని, 117 వ పట్టప్రకారం

అది అసంభవమండి. ఉభయ పక్షాలవారూ కలిసి ఒక ఒప్పందానికి రాలేకపోయారు గనక, కోర్టువారు తీర్పుచెప్పడం జరిగింది. తీర్పనేది అమలు జరిగి తీరాలి' అన్నాడు. కాని, వినిపించుగోదల్చుకోలేదు న్యాయాధికారి, ఆ గుమాస్తా మాటలు, 'నీ నాలిక కట్టేసెయ్, నేస్తం, చట్టాలన్నింటి లోకీ మొదటిచట్టం భగవంతుణ్ని అనువర్తించడం భగవంతుడికి సఖ్యత ఇష్టం.' అని. ఆ న్యాయాధికారి ఆ రైతులకి ఎల్లాగేనా నచ్చచెప్పడానికి ఎంతో తంటాలు పడ్డాడు. కాని లాభం లేకపోయింది. గేబ్రియల్ అతడుచెప్పేది వినదల్చుగోలేదు. అతడు, 'మీదటికి నా వయస్సు యాభై. నాకు పెళ్ళి అయిన కొడుకున్నాడు. జన్మలో ఎన్నడూ నేను కర్రదెబ్బలు తిని ఎరగను. ఇప్పుడు గుంటల మొహమూ వీడూ ఈ ఇవాను బయట్టేరి నాకు దెబ్బల శిక్ష వెయించాడు. ఇప్పుడు నేను వెళ్ళడమూ వాడి క్షమాపణ కోరుకోవడమూనా? ఛీ ఛీ. బోలెడు భరించాను. ఇంకానా? ఎంమిటు నన్ను జ్ఞాపకం ఉంచుగోవాలో ఇవాన్ గ్రహిస్తాడు!' అన్నాడు. మళ్ళీ గేబ్రియల్ కంఠస్వరం జంకడంవల్ల, అతడు మరి చెప్పలేక, వెనక్కి తిరిగి వెళ్ళాడు.

కోర్టునించి గ్రామానికి ఏడుమైళ్ళు. ఇవాన్ ఇంటికి చేరేసరికి ఆలస్యం అయింది. అతడు తన గుర్రం కట్లూ తాళ్ళూ విప్పి దాని రాత్రికట్టుచోటికి దాన్ని చేర్చి, ఇంట్లో ప్రవేశించాడు. ఇంట్లో ఒక్కరూ లేరు. పశువుల్ని మళ్ళేసుగు రావడానికి స్త్రీలు వెళ్ళిపోయారు, కుర్రాళ్లు పొలాల్నించి ఇంకా తిరిగిరానే లేదు. అతడు లోపలికి వెళ్ళి, కూచుని, ఆలోచించాడు. అంతా

అంతా జ్ఞప్తికి తెచ్చుగున్నాడు—శిక్ష పడవడం విన్నప్పుడు గేబ్రియలు ఎల్లా ఉన్నాడో, అతని మొహం ఎల్లా పాలిపో యిందో, అతడు తన మొహం గోడకేసి ఎల్లా తిప్పేసు గున్నాడో—అదంతా. అతడిగుండె అంతన్నీ దిగదోడింది. తనకే గనక ఆ శిక్ష పడుంటే తనికి ఏమనిపించేదో ఊహించుగుని, గేబ్రియలు గురించి జాలిపడ్డాడు. అప్పుడు మిద్దెమీంచి వాళ్ళ నాన్న దగ్గు వినపడింది. అతడటు చూడగా, వాళ్ళనాన్న లేచి కూచుని, కాళ్ళుదింపి, కిందికి దేకుతున్నాడు. కింద ఒక పీటం దగ్గిరికి ఆయన తన ఘటం జేరేసి, కూచున్నాడు. దిగడం హైరానవల్ల ఆయనకి మరీ ఆయాసం వచ్చి, మళ్ళీ దగ్గడం మొదలెట్టి, కొంత సేపటికిగాని గొంతిగ సాఫుచేసుగో లేక పోయాడు. అప్పుడు బల్లమీద జార్లపడి, ఆయన. 'ఏం అతనికి శిక్ష వేశారా?' అని అడిగాడు. 'ఆ, ఇరవై కర్రదెబ్బలు' అన్నాడు ఇవాన్. ముసిలాయన తల పంకిస్తూ, 'అబ్బెబ్బే. పాడుపని. నువ్వు చేస్తూన్నది తప్పు, ఇవాన్. అయ్యో, అత డికి కంటె నీ స్వంతానికే మరీ పాడు! సరే, అతణ్ణి బాత్తారు. దానివల్ల నీకు కలిగే మేలు ఏమిటీ?' అన్నాడు. 'అతడు మళ్ళీ అల్లాంటిది చెయ్యకుండా ఉంటాడు' అని ఇవాన్ బదులు చెప్పాడు. 'అతడు మళ్ళీ చెయ్యకుండా ఉండేదేమిటీ? నువ్వు చేసిం దానికంటె పాడు అతడు చేసిందేమిటీ?' అని ఆయన ప్రశ్నిం చాడు. అందుకు ఇవాను, 'ఏమిటా! నా కెంతపాని చేశాడో మాడు. నా భార్యని చంపేటంత పనిచేశాడు. ఇప్పుడు మన్ని అందర్నీ తగలబెట్టేస్తాడట. అల్లా అన్నందుకు వెళ్ళి అతడికి దణ్ణంపెట్టి

రానా ?' అంటూ వాదించాడు. ముసిలాయన నిట్టూర్పు పుచ్చి 'ఇవాన్, నువ్వు ప్రపంచంలో తిరుగుతున్నావు, నేను ఇన్నేళ్ళ నించీ మిద్దెమీద పడుకుని ఉంటున్నాను. కాబట్టి, సర్వమూ నువ్వు చూసేశావనీ తేశమైనా నేను చూడలేదనీ నువ్వు భావిస్తు న్నావు—అయ్యో, వెర్రితండ్రీ, నువ్వేరా చూడకుండా ఉంటా! హానిచెయ్యాలనేబుద్ధి నీకళ్ళు కప్పేసింది. ఇతరులపాపాలు నీ కళ్ళ ముందున్నాయి. నీ స్వంతపాపాలు నీ వీపు మీదున్నాయి. 'అవ తలవాడు చెడుగా ప్రవర్తించాడు!' అనేది ఎందు కొచ్చిన మాటా? చెడుగా ప్రవర్తించేది వాడు మాత్రమే అయితే, మరి దెబ్బలాట అల్లానే నిల్చిఉందేం? మానవుల్లో ఎప్పుడైనా ఒకడి వల్లే పెరిగిందా దెబ్బలాటా? దెబ్బలాట ఎప్పుడూ ఇద్దరికి! అతడి చెడుగు నువ్వు చూస్తూన్నావు, నీ చెడుగు నువ్వు చూడవు. అతడు చెడుగుగానూ నువ్వు మంచిగానూ ఉండి ఉంటే, దెబ్బ లాటే ఉండకపోను. అతడి గడ్డం వెంట్రుకలు ఊడలాగింది ఎవరూ? అతడి గడ్డిమేటి పాడుచేసింది ఎవరూ? అతణ్ణి కోర్టుకి ఈడ్చింది ఎవరూ? అయినానరే, నువ్వు అంతా పట్టిగెళ్ళి అతని నెత్తినే రుద్దుతావే? నీకు నువ్వే చెడుమార్గాన్ని జీవిస్తున్నావు. అక్కడుంది అధర్మం. అటువంటి మార్గాన్ని నేను జీవించలేదు, విన్నావా అబ్బాయి, అటువంటి మార్గాన్ని జీవించు అని నేను బోధించాలేదు. అతడి ముసలి తండ్రీ నేనూ ఆవిధంగానే జీవి స్తూండేవాళ్ళమా? మరి, ఏవిధంగా జీవించాం? ఇరుగుపొరుగు వాళ్ళు జీవించవలిసిన విధంగా! వాళ్ళింటో పిండి నిండుకుం దనకో, స్త్రీలల్లో ఒకరు అడ్డదార్ని వచ్చి, 'మామయ్యా! మాకు

కొంచెం పిండి కావాలి!' అని అడిగేవాడు. 'గాదికొట్టు దగ్గిరికి నడమ్మా, మీకు కావలిసినంతా తీసుకుందుగాని!' అని నేనసే వాణ్ణి. అతడి గుర్రాల్ని బీటికి తోలుకు వెళ్ళేవాళ్ళెవరూ రాక పోతే, 'ఒరేయ్, ఇవాన్, వాళ్ళ గుర్రాలసంగతి చూసిరా!' అని నేను పంపేవాణ్ణి. నా కేదేనా అవసరం అయితే, అతడి దగ్గిరికి వెళ్ళేవాణ్ణి. వెళ్ళి, 'బాబూ, నాకు ఫలానా కావాలి!' అనేవాణ్ణి. అతడు, 'బాబూ, ఇదుగో, పట్టిగెళ్ళు' అనేవాడు. మాకు అల్లా నడిచిపోయేది, కులాసాగా కాలం గడిచిపోయేది కాని, ఇప్పుడా? మొన్న ఒకనాడు ఒక యుద్ధభటుడువచ్చి చెప్పడం మొదలెట్టాడు చూశావా ఆ ప్లవేనా యుద్ధంగురించి? అదుగో, దానికంటె మరీ పాడుగాఉంది మీ యిద్దరూ చేసుకునే యుద్ధం. అదా జీవితం అంటే?....అది ఎంతపాపం! నువ్వు ప్రాజ్ఞుడవు, గృహయజమానివి, గనక సమాధానం చెప్పవలిసింది, నువ్వే. స్త్రీలకీ పిల్లలకీ ఏమిటి నువ్వు నేర్పుతూన్న పాఠం? కోపంతో మొరగడమూ పళ్ళుగుచ్చి పీకడమూనా? విన్నావా, అపుష్య, నీ చిన్న తమ్ముడున్నాడే, ఆ అప్రాజ్ఞుడు ఎంచేశాడో! పక్కావిడతో ప్రసంగిస్తూ ఒట్లూ తిట్లూనూ! మీ అమ్మ అవన్నీ వింటూ నవ్వుతూఉంది. అది ధర్మమా? సమాధానం చెప్పవలిసింది నువ్వే. నీ ఆత్మ గురించి ఆలోచించు. ఇదంతా ఉండవలిసి నట్టుందా? నువ్వు నామీద ఒకమాట విసురుతావు, దానికి బదులుగా నేను నీమీద రెండు విసురుతాను. నన్ను ఒక్కటి కొట్టు, నిన్ను నేను రెండు కొడతాను. అల్లాకాదబ్బాయి, విను. ఈ రీతికి చాలాభిన్నం, ఉండవలిసినరీతి. ఎవడేనా నిన్ను కష్టపెట్టేమాట

అంటే, కాస్సేపు నోరుమూసుకుని ఊరుకో. అతని అంతరాత్మ అతనికే నేరం ఆరోపిస్తుంది. మన ప్రభువు బోధించింది అది. ఎవడేనా నిన్ను ఒక చెంపమీద కొడితే, నువ్వు రెండోచెంప వాడికి అర్పిస్తూ, 'ఇదుగోనయ్యా, కొట్టు, ఇందుకే నేను తగుతానని తోస్తే' అనా లంటాను. అప్పుడు వాడి అంతరాత్మ వాణ్ణే మందలిస్తుంది. వాడు కొంచెం సాధువై, నీమాట సరిగా అర్థం చేసుగుంటాడు. గర్వం చంపుగోడానికి ప్రభు వుపదేశించిన మార్గం అది....ఏం? మాట్లాడవేం? నేను చెప్పింది కాదంటావా?' అన్నాడు. ఇవాను నిశ్శబ్దంగా కూచుని శ్రద్ధగా విన్నాడు.

ముసిలాయన దగ్గి, అతి కష్టంమీద గుక్కతిప్పుగుని, మళ్ళీ మొదలెడుతూ, 'క్రీస్తు మనికి ఉపదేశించింది తప్పంటావా? అబ్బే, అదంతా మన స్వంత శ్రేయస్సుకోసమే. మొదట పోనీ, భూమిమీది నీ జీవితం గురించి కాస్త ఆలోచించు. మీ రిద్దరూ యుద్ధంలోకి దిగింతరవాత, నీపని మెరుగయిందా? వెళ్ళేటప్పుడు బళ్ళు వచ్చేటప్పుడు బళ్ళు మధ్యదారిలో తిళ్ళు—వీటికింద ఈ కోర్టు వ్యవహారాల గురించి నువ్వు ఇప్పటికి ఎంత వెచ్చించిపారేశావో కాస్త లెఖ్ఖకట్టు. నీ కొడుకుల్ని చూశావా, ఎంత దర్జాపురుషుల్లాగ తయారయారో! నువ్వు జీవించడానికీ పైకి రావడానికీ కూడా వీలేమరీ! కాని, ఇప్పుడు నీకు డబ్బొచ్చే మార్గాలన్నీ సన్నగిల్లుతున్నాయి. ఎందుచేత? నీ తప్పిదంవల్ల, నీ గర్వంవల్ల. నీ కుర్రాళ్ళతో కలిసి నువ్వు పొలం దున్ని విత్తులు స్వయంగా చల్లవలసినమాట. కాని, దెయ్యంవచ్చి ఈడ్చుగు

పోతోంది నిన్ను ఏ జడ్జీ దగ్గిరికో, ఏ తలకిమాసిన న్యాయవాది దగ్గిరికో, మరోడి దగ్గిరికో. నువ్వు సకాలంలో ఓ న్నడమూ లేదు, సకాలంలో విత్తులు చల్లడమూలేదు. మరి భూమాత కానుపు సరిగ్గా ఎల్లా ఉంటుందీ? ఈ సంవత్సరం పంటలు ఎందుకు పోయినాయి? అసలు ఊడుపులు ఎప్పుడైనాయి? నువ్వు పట్నాన్నించి తిరిగి వచ్చింతరవాత! ఏంలాభంతీశావు? నీ భుజాలమీదికే భారం తెచ్చిపెట్టుగున్నావు. ఒరేయి, అబ్బాయి! నీ స్వంతపని గురించి ఆలోచించుగో. నీ పిల్లల్తో కలిసి పొలం లోనూ ఇంట్లోనూ పనిచేసుగో. ఎవడేనా నీకు కష్టంకలిగిస్తే, వాణ్ణి క్షమించెయ్, క్షమించడం దేవుడి ఇచ్ఛగనక. అప్పుడు జీవితం సజావుగా ఉంటుంది, గుండె ఎప్పుడూ తేలికగా ఉంటుంది,' అన్నాడు. ఇవాను మౌనంగానే ఉండిపోయాడు.

'ఇవాన్, నా తండ్రీ! ముసిలి నాన్నమాట వినిపించుగో! వెళ్ళి నల్లగుర్రాన్ని బండికి పూన్చి, తక్షణం ఆ ప్రభుత్వపు కచేరీకి పరిగెత్తి, అక్కడ ఈ వ్యాపారం మొదట మట్టం చేసెయ్. పొద్దున్నే లేచివెళ్ళి, దేవుణ్ణి తల్చుగుని గేబ్రియల్‌తో సఖ్యతపడి, రేపు పండగ (కన్యామాత జననదినం) గనక, నీ యింటి కతణ్ణి ఆహ్వానంచేసి తీసుగొచ్చి, లోగడే టీ సిద్ధం చెయించి ఓ సీసా మద్యం జాగర్తపెట్టి, ఈ దుష్టవ్యవహారాన్ని ఇంటిదగ్గిర మట్టంచేసెయ్. భావికాలానికి ఈ కలహం లేశంకూడా మిగలనీకు. స్త్రీలతోనూ పిల్లలతోనూ కూడా సఖ్యత గురించి చెప్పెయ్' అని ఆ వృద్ధుడు ఉపదేశించాడు.

ఇవాను నిట్టూర్పు పుచ్చి, 'ఈయన చెప్పేది యథార్థమే' అనుకోగానే అతని గుండెబరువు చాలావరకు తగ్గిపోయింది.

కాని, ఆ పరిస్థితిలో సంగతులు సరిచెయ్యడానికి ఎల్లా ప్రారంభం చెయ్యాలో మాత్రం అతనికి తెలియలేదు.

ఇవాన్ మనస్సులో ఉన్నది తను ఊహించుకో గలిగాడో అన్నట్టు, ముసిలాయన మళ్ళీ మొదలెట్టి, 'వెళ్ళు, ఇవాన్. ఈ విషయం బరగెయ్యకు, వ్యాపించకపూర్వమే నిప్పు ఆర్పాలి. లేకపోతే, మరీ ఆలస్యం అవుతుంది' అన్నాడు.

ముసిలాయన ఇంకా కొంత చెప్పడానికి ఉద్యుక్తు డయాడు. కాని అతడింకా చెప్ప కలగకుండానే, వసపిట్టలలాగ వాగుతూ ఆడవాళ్ళు లోపలికి వచ్చిపడ్డారు. గేబ్రియల్‌కి దెబ్బలశిక్ష వేశారనీ అతడు ఇల్లు అంటిస్తానని బెదరించాడనీ వాళ్ళకప్పుడే తెలిసిపోయింది. ఆ వృత్తాంతం వాళ్ళు విని, దానికి తమ స్వంత కవిత్వం కొంతచేర్చి, పచ్చిక బీడులో, గేబ్రియల్ ఇంటి స్త్రీలతో విషయం యొక్క వయినాలగురించి దెబ్బలాడారు. గేబ్రియల్ కోడలు ఇవాన్‌మీద మరో కొత్త ఛార్జి ఇప్పిస్తానని బెదిరించినట్టు వాళ్లు చెప్పుగొచ్చారు. అదేమిటంటే: తణిఖీచేసే దండనాధికారి దయ గేబ్రియల్ సంపాదించాడనిన్నీ ఆ అధికారి వచ్చి వ్యాపారమంతా తిరగదోడి పూర్తిగా తల్లకిందులు చేసేస్తాడనిన్నీ, ఇవాన్‌మీద, బండి శాయిమేకూ వంటింటితోటాగురించిన యావత్తు విషయాలతో, బడిపంతులుచేత, ఈసారి చక్రవర్తికే, వేరే విన్నపం రాయిస్తున్నారనిన్నీ, కాబట్టి ఇవాన్ ఇంటిపట్టులో చెరిసగం గేబ్రియల్‌కి అయిపోతుందనిన్నీ! ఈ మాటలు ఇవాన్ చెవిని పడగానే, అతని మనస్సులో మళ్ళీ విముఖత్వం జనించడంవల్ల, గేబ్రియల్‌తో సఖ్యతపడాలనే ఆలోచనే విసర్జించేశాడు.

పొలంపట్టున చెయ్యవలిసినపని యజమానికి బోలెడుంటుంది. స్త్రీలతో మాట్లాడ్డానికి మరి ఆగకుండానే ఇవాను కళ్ళందగ్గిరికీ గాదెదగ్గిరికీ వెళ్ళాడు. అతడు అక్కడికి చేరుకునే సరికి సూర్యుడు అస్తమించేశాడు. పిల్లలందరూ పొలాల్నుంచి ఇంటికి వచ్చేశారు. శీతకాలం పంటకి రెండు గుర్రాలతో వాళ్ళ పొలం దున్నుతున్నారు. ఇవాను వాళ్ళకి ఎదురై, పనిగురించి కనుక్కుని, ఏవస్తువు ఆచోట పెట్టడానికి వాళ్ళకి సాయపడి, గుర్రపు మెడచుట్టు ఒకటి పాడైపోతే అది బాగు చెయ్యాలనేసి, కొన్ని కర్రలుంటే అవి గాదెకింద పెట్టాలనుకుని చాలా చీకటిపడి పోడంవల్ల వాటిని ఉన్నచోటే వదిలేద్దామని నిశ్చయించుగున్నాడు. అతడు పశువులకి మేతవేసి, గేటు తెరిచి, చిన్న తమ్ముడు బీటికి తోలికెళ్ళి రాత్రి కాయవలిసిన గుర్రాల్ని విప్పేసి, మళ్ళీ గేటు మూసి, గడియ వేసేశాడు. 'ఇక భోజనంచేసి పడుకో వచ్చును' అనుకున్నాడు. గుర్రం మెడతొడుగుపుచ్చుగుని, అతడు ఇంట్లో ప్రవేశించాడు. ఇంతసేపూ అతడు గ్రేబియల్ గురించీ తన ముసిలి తండ్రి ఎంతోసేపు చెప్పిన మాటల్నిగురించీ కూడా మరిచిపోయాడు. కాని, అతడు నడవలో ప్రవేశించడానికి వెళ్ళి తలుపుపిడి చేత్తోపట్టుకోగానే. పక్కింటివాడు బొంగురు గొంతిగవేసుగుని కంచెకి అవతల ఎవడికో శాపనార్థాలుపెట్టడం విన్నాడు. 'ఆ దిక్కుమాలి పీనుగు ఉండేటే మాత్రం ఎందుకు పనికొస్తాడూ! వాడు హత్య చెయ్యబడడానికి మాత్రమే అర్హుడు.' అని గ్రేబియల్ అంటున్నాడు. ఈమాటల్తో ఇవాన్‌కి ఉండే వెనకటి ద్వేషం మళ్ళీ మేలుకుంది. అల్లా గ్రేబియల్ తిడుతూ

న్నంత సేపూమాత్రం తలుపు దగ్గిరనుంచుని ఆలకించి, తరవాత అతడు లోపలికి వెళ్ళాడు.

లోపల దీపం ఉంది, కోడలు దారంతీస్తూ కూచుంది, భార్య రాత్రిభోజనం సిద్ధం చేస్తోంది, పెద్దకొడుకు మట్టలచెప్పులకి ముక్కలు కోస్తున్నాడు, రెండోవాడు పుస్తకం పుచ్చుగుని బల్ల దగ్గిర కూచున్నాడు, చిన్నతమ్ముడు రాత్రికాపుకి పచ్చికబీటికి గుర్రాల్ని తోలుకు వెళ్ళడానికి తయారౌతున్నాడు. పక్కింటి వాడు అనే జాడ్యమే లేకుండా ఉంటే, ఇంట్లో అంతా సంతోషంతో కలకలలాడుతూ నిక్షేపంలా ఉండవలిసిందేమరీ! ఇవాన్ మూతి ముడుచుగుని బొమముడితో ప్రవేశించాడు. బెంచిమీద ఉన్న పిల్లిని కింద గిరవాటెట్టాడు. మురికినీళ్ళతొట్టి స్థలం తప్పించి పెట్టినందుకు ఆడవాళ్ళని సాదించాడు. నిరాశలో పడ్డట్టై ఘుమఘుమలాడుతూ ఆ గుర్రం మెడతొడుగు బాగుచెయ్యడానికి కూచున్నాడు. గేబ్రియల్ మాటలు అతని చెవులో ఇంకా గింగురుమంటూనే ఉన్నాయి: కోర్టులో బెదిరించినప్పుడూ, 'హత్య చెయ్యబడడానికి మాత్రమే అర్హుడు' అంటూ ఎవణ్ణో గురించి బొంగురుగొంతిగతో అంతకి పూర్వమే అతడు అరుస్తూనూ, అన్నవి. అతని చిన్నతమ్ముడు వదినగారు పెట్టిన రాత్రితిండి కానిచ్చేసి, పాతపట్టె గొర్రెచర్మమూ కోటూధరించి, నడుంచుట్టూ కాశెకోక బిగించి, కొంచెం రొట్టె పొట్లంకట్టుగుని, బయటనుంచున్న గుర్రాలదగ్గిరికి వెళ్ళాడు. అతని పైవాడు అతణ్ణి సాగనంప పోతూండగా, అతడి బదులు ఇవాన్ లేచి, ముందు వాకిట్లోకి వెళ్ళాడు. అవతల కారు చీకటి కమ్మేసింది, పైన మేఘం దట్టంగా పట్టింది, కింద ఈదురుగాలి

రేగుతోంది. మెట్లుదిగి ఇవాన్ తన చిన్నతమ్ముణ్ణి గుర్రం ఎక్కించి, గుర్రపుపిల్లని వెనకాతే తోలి, ఆలకిస్తూ నుంచున్నాడు. చిన్న తమ్ముడు అల్లా గుర్రాల్తో బయల్దేరి సాగగానే, మరి కొందరు తమ గుర్రాల్ని తోలుకుంటూ అతనితో చేరారు. వాళ్ళు వినికిదూరం దాటివెళ్ళే దాకా ఇవాన్ అక్కడే నిలబడ్డాడు. అల్లా గేటు దగ్గిర అతడు నుంచున్నప్పుడు, 'నీ తాలూకు ఏదో అంతకంటె ఘోరంగా మండవచ్చు, జ్ఞాపకం ఉంచుకో' అనే గేబ్రియల్ మాటలు మాత్రం అతడి తలలోంచి పోలేదు. అతడు తనలో, 'వాడు అంతా నిరాశ చేసుకున్న మనిషి, చుట్టుపక్క యావత్తూ ఎండి ఉంది, దానికితోడు ఈదురుగాలి సాగింది. ఏ వెనకవైపునో దేనికో వాడు నిప్పుముట్టించి తుర్రు మన వచ్చు. ఈ వసతి యావత్తూ తను తగల పెట్టడమూనూ తన మీద ఒక్క దెబ్బైనా పడకుండా తను స్వేచ్ఛగా ఉడాయించడ మూనా, తుచ్ఛుడు! కాని ఒకటి, వాడు ఆ పని చేస్తూన్న సమ యంలో గనక వాణ్ణి పట్టేస్తే అప్పుడెల్లా పారిపోతాడువాడూ?' అనుకున్నాడు, ఆ ఆలోచన అతని మనస్సులో ఎంత స్థావరంగా కుదురుకుంటే, అతడు తన గుమ్మం మెట్లెక్కి ఇంట్లోకి వెళ్ళనేలేక పోయాడు. 'ఇళ్ళ చుట్టూతిరిగి చూ సొస్తాను. వాడు ఏ యత్నం మీద ఉన్నాడో ఎవడు చెప్పగలడు?' అను కుంటూ, నిశ్శబ్దంగా అడుగులు వేసుగుంటూ అతడు గేటుదాటి, వీధులో నడుచుగుంటూ వెళ్ళి మలుపు సమీపించాడు. అక్క ణ్ణించి సరిహద్దు కంచె పొడూగునా అతడు చూడగా ఎదర మూల ఏదో అథాత్తుగా మెదిలినట్టు అయింది, ఎవరో పైకివచ్చి మళ్ళీ

మాయం అయ్యింపే మెరిసినట్టు. ఇవాన్ ఆగిపోయి, నిశ్శబ్దంగా నిలబడి, జాగ్రత్తగా వింటూ, నిదానంగా చూశాడు. ఎక్కడా చీమ చిటుక్కు మనడం లేదు. గాలిమూలంగా నీటి ముక్కాకుల రెపరెపా, రెల్లుపోచల గలగలా మాత్రం చెవిని పడుతోంది. మొదట్లో అంతా మసిచీకటే గాని, అతని కళ్ళకి చీకటితో కొంత పరిచయం ఏర్పడ్డ తరవాత, అతనికి, దూరాన్ని, ఎదర మూల నాగలీ చూరూ లాంటివి గోచరం అయినాయి. అపే ఇంకా చూశాడుగాని, అక్కడ మనిషెవడూ లేడు. అతడు తనలో, 'నాది పొరపా టనుకుంటాను. అయినాసరే, ఓ చుట్టు వెళ్ళి చూసేస్తాను' అనుకుని, ఒక పాకపక్కనే పిల్లిలా వెళ్ళాడు. మట్టి చెప్పుల్తో అతడు ఎంత నెమ్మదిగా అడుగులు వేశాడంటే, వాటి చప్పుడు తనకే వినిపించలేదు. ఎదరమూల ఏదో భగ్గుమన్న ట్టైంది, ఒక్కక్షణం. నాగలిదగ్గిర, అది మళ్ళీ మాయమైంది. ఇవాన్ తన గుండెమీద దెబ్బ తిన్నట్టై ఆగిపోయాడు. అతడు ఆగిపోయాడో లేదో ఇందాకటి స్థలంలోనే ఇంకా కాంతితో మళ్ళీ భగ్గుమంది. ఆ వెలుగులో నెత్తిని టోపీతో ఇటువేపు వీపెట్టి వంగిఉన్న ఒక మనిషి విగ్రహం అతనికి స్పష్టంగా కనపడింది. వాడు తన చేతులో పట్టుగున్న గడ్డితుట్టతో ముట్టిస్తున్నాడు. ఇవాన్‌గుండె పిట్టకొట్టు గున్నట్టు లోపల కొట్టు గుంది. ఊతం బలవంతం చేసుగుని ఎల్లాగో పెద్ద పెద్ద అంగలు వేస్తూ అతడటు కదిలాడు. అప్పుడు తనకి కాళ్ళున్నట్టు అతడికి అనిపించనేలేదు. అతడు తనలో, 'ఆఁ, ఇప్పుడు మరి పారిపో లేడు. అతణ్ణి బరిమీద పట్టుగుంటాను' అనుకున్నాడు. ఇవాన్ ఇంకా కొంత దూరాన్ని ఉండగానే, ఆకస్మికంగా ఒక మంచి వెలుగు చూశాడు. ఇది ఇందాకటి చోటుకాదు, ఇందాకటంత

చిన్నదీకాదు కుడానూ, చూరుదగ్గిర గడ్డి భగభగలాడి, క్రమేపీ మంటలు వెనుకువ్పకేసి పాకిపోయాయి. నేలమీద నుంచున్న గేబ్రియల్ పూర్ణవిగ్రహం అతి స్పష్టంగా కనిపిస్తోంది. దేగ రైంయిమని దిగుతూ పిట్టమీద వాలినట్టు ఇవాన్ కుంటి గేబ్రియలు కేసి చొచ్చుగు వెళ్ళాడు. 'ఇప్పుడు వాణ్ని పట్టేశానే! మరి నన్ను తప్పించుగోలేడు' అనుకున్నాడు. కాని, గేబ్రియల్ ఇవాన్ అడుగుల చప్పుడు ఎల్లా వినగలిగాడో విని, చుట్టూ పరకాయించి, గది పక్కనించే తొందర తొందరగా చెవలపిల్లి లాగ దాటేశాడు. అతణ్ని ఇవాన్ బాణంలా వెంటాడుతూ 'నువ్వు తప్పించుగో లేవ్' అని కేకేశాడు. ఇవాన్ గేబ్రియల్‌ని పట్టేశా ననుకున్నాడు గాని, గేబ్రియల్ ఒసిలి తప్పించు గున్నాడు. కాని, గేబ్రియలుకోటుయొక్క అంచుభాగం మాత్రం ఇవాన్ దొరకపుచ్చుకో గలిగాడు. ఆ భాగమే తీరుగా చిరిగి చేతులో మిగలగా, ఇవాను పడిపోయాడు. ఎల్లాగో మళ్లీ కాళ్ళాని, 'రండి. పట్టుగోండి. దొంగలు. ఖూనీ.' అంటూ అరుస్తూ అతడు మళ్ళీ పరిగెత్తాడు. కాని, ఈ లోపున గేబ్రియల్ తనయింటిగేటు జేరుకుంటున్నాడు. అతణ్ణిఇవాన్ అక్కడ అందుకో గలిగాడు. పట్టేసుగోడానికి సిద్ధంగా ఉన్నాడు. ఆక్షణంలో అతణ్ణి ఏదో పుచ్చుగుని దాదేశారు. ఆదెబ్బతో అతనికి స్పృహ పోయింది. రాయి పుచ్చుగుని అతడి కణతమీద కొట్టినట్టైంది. తరవాత అతనికేమి తెలియదు. అసలు గేబ్రియలే అగేటు పక్కని ఒక చేపదూలంకొర్రు పడుంటే అది పుచ్చుగుని దాగా పైకిత్తి తన శక్తికొద్దీ నూకేశాడు. ఇవాన్ ఇంద్రియాలు పళం తప్పాయి. మొదట అతని కళ్ళ ఎదట నిప్పురవ్వలు ఎగురు తూన్నట్టుంది, తరవాత అంతా చీకటైపోయింది. అతడు తూలి

పోయాడు. అతనకి స్పృహవచ్చే సరికి, గేబ్రియల్ అక్కడ లేడు. పగటి కాంతిలా వెలుగు ఉంది, తన యింటి ప్రాంతం వైపునించి ఏదో ఇంజను పనిచేస్తూన్నట్టు హోరూ టపటపలాడడమూ వినిపించాయి. ఇవాన్ గిర్రున తిరిగి చూసే సరికి, తమ వెనకపాక మంటల్లో ఉంది, పక్కపాక అప్పుడే అంటుగుంది. మరి మంటలూ, పొగా, పొగతోపాటు ఎగిరినా ఆరిపోని గడ్డి నెరుసులూ- ఇవన్నీ గాలి వాటాన్నిబట్టి తమరి అసలింటి వేపు వెడుతున్నాయి.

'ఏమిటిది, స్నేహితులారా?....' అంటూ ఇవాన్ అరుస్తూ, తన నిరాశలో ముంజేతుల్తో తొడలు తట్టుగుంటూ, 'అయ్యయ్యో, వాడు ఆ కొరివి చూర్లోపెట్టగానే అక్కణ్ణించి దాన్ని లాగేసి కాల్తో మట్టేసి ఉండడమే కదా నేను చేసి ఉండవలిసిన కాస్త పనీనూ! అయ్యో! ఏమిటిది, స్నేహితులారా!....' అంటూ రెట్టించడం మొదలెట్టాడు. కేకవెయ్యబోయాడు, కాని ఊపిరి ఆడలేదు, కంఠం అసలేపోయింది. పరిగెత్తబోయాడు, కాని కాళ్ళు తను చెప్పినట్టు విన్లేదు, పైగా ఒకదాని కొకటి అడ్డు పడ్డాయి కుడానూ. అతడు మెల్లిగా దేకబోయి మళ్ళీ తూలి పోయాడు. మళ్ళీ ఊపిరి అందుకోలేకపోయాడు. కాస్త ఊపిరి కుదటపడేదాకా నుంచుని, అతడు ముందుకి నడిచాడు. అతడు వెనకపాకచుట్టూ తిరిగి వచ్చి మంట ఎక్కడుందా అని తీరా చూస్తే పక్కపాకకుడా జ్వాలల్లోఉంది, పైగా అసలిల్లు ఒక మూలానూ గేటు గుమ్మంమీద కప్పూనూ అప్పటికే ఎర్రపడ్డాయి. చూస్తూండగానే అసలిల్లు గప్పున అంటుగుపోయింది. అసలింట్లోంచి అగ్ని తన జ్వాలలు కక్కడంవల్ల దొడ్డిధరిమేనా వెళ్ళడానికి వీల్లేకపోయింది. కావలసినంతమంది పోగయ్యారు

కాని ఏమీ చెయ్యలేకపోయారు. అంతాకుడా, ఎవరిసామాన్లు వాళ్ళు కొంచెం ఎడంగా మోసేనుగోడం, సాలల్లోంచి పశువుల్ని బయటికి తోలేసుగోడంలో పడ్డారు. ఇవాన్ ఇల్లు అయిపోగానే గేబ్రియల్ ఇల్లు అయిపోయింది. అగ్నిని చూడ్డానికి వాయువు మహావేగంగా వస్తుంది, గనక ఆ మంటలు క్షణంలో వీధి అవతలవేపుకి వ్యాపించేసి, గ్రామంలో చెరిసహాన్ని బుగ్గిచేసేశాయి. ఇవాన్ ఇంట్లో, బ్రహ్మాండంమీద వాళ్ల ముసిలినాన్నని బయటికి సాయంపట్ట గలిగారు. కడంవాళ్ళందరూ కట్టుబట్టల్తో బతిగి బయట పడ్డారు. తక్కిందీ సకలమూ, అదుగో రాత్రిమేతకి పచ్చికబీటికి తోలిన ఆ గుర్రాలు తప్ప, మసి అయిపోయింది. ఉన్న పశువులు, కమ్మలమీద నుంచున్నపాట్నకోళ్లు, బళ్ళు, నాగళ్ళు, చచ్చవుకాలు, నిండాబట్టల్తో స్త్రీల పెట్టెలు, నిండా ధాన్యంతో గాదులు,—సర్వమూ తగులడి చక్కాపోయింది. గేబ్రియల్ ఇంట్లో, పశువుల్ని విప్పి బయటికి కొట్టెయ్య గలిగారు, ఏ కొద్దిగానో సామాన్లూ జాగ్రత్తపడగలిగారు.

మంట రాత్రిపొడుగునా ఉంది. ఇవాన్ తన ఇల్లు ఉంటూండే ప్రాంతం యెదటనుంచుని పదేపదే. 'ఏమిటిది, స్నేహితులారా! అది ఎవడు ఇవతలకి లాగేసి మట్టగించేసినా తీరిపోయేదిగదా!' అంటూండడం మానలేదు. ఇంటి పైకప్పు కూలిపోయినప్పుడు సగంకాలిన దూలంఒకటి తేవాలనుకుని అతడు మంటల్లో దూరబడ్డాడు. వెళ్ళద్దు వెళ్ళద్దని ఆడవాళ్లు గోలెట్టారు. కాని అతడు వెళ్ళి ఆదూలం తెచ్చి, మళ్లీ మరో దూలంకోసం వెళ్ళబోతూ అడుగుపట్టు తప్పి అడ్డంగా మంటల్లో పడిపోయాడు

అతని కొడుకు సాహసించి దారిచేసుగుని తండ్రి వెనకాలేవెళ్ళి అతణ్ణి బయటికి ఈడ్చాడు. ఇవాను జుట్టూ గడ్డమూ కాలిపో యాయి, చేతులమీది చర్మం మాడిపోయింది. అయినాసరే అతనికి ఏమీ అనిపించనేలేదు. 'పాపం, దుఃఖంమూలాన్ని ఇవాసు బాధ అంటే తెలియని స్థితిలో పడ్డాడు' అనుకున్నారు జనం. మంటలన్నీ చప్పగా చల్లారేటప్పుడుకుడా, ఇవాన్ నిశ్చ లంగానుంచుని పదేపదే 'స్నేహితులారా 'ఏమిటిది ? ఎవడేనా దాన్ని ఇవతలికి లాగేసి ఉండవలిసింది !' అంటూనే ఉన్నాడు.

ఉదయాన్నే గ్రామపెద్దగారి కొడుకు ఇవాన్ని తీసిగెళ్ళడానికి వచ్చాడు 'ఇవాన్ బాబూ ! మీ తండ్రిగారు మరణశయ్యమీద ఉన్నారు. మీకు సెలవు చెప్పేయ్యాలిట, మిమ్మల్ని తీసుగురమ్మ న్నారు' అని అతడు చెప్పాడు. ఇవాన్ తన తండ్రి సంగతే మరిచి పోవడంవల్ల తండ్రిగురించి చెప్పినమాటలు అతనికి అర్థమే కాలేదు. 'తండ్రి ఏమిటి ? ఎవర్ని రమ్మంటూ,' అంటూ అడ గడం మొదలెట్టాడు. 'మిమ్మల్నే రమ్మన్నారు, చివరిసెలవు చెప్పేయ్యడానికి. మా యింట్లో ఆయన మరణించడానికి సిద్ధంగా ఉన్నారు. వచ్చేయ్యండి, ఇవాన్ బాబూ !' అంటూ ఆ అబ్బాయి ఇవాన్ చెయ్యిపట్టుగుని లాగగా, ఇవాన్ అతనితో వెళ్ళాడు. ఇవాన్ఇల్లు అంటుకోగానే, ఇంట్లోంచి బయటికి చేర్చే టప్పుడు కాల్తూన్నగడ్డి కొంత ఆయనమీద కూడా పడడం వించి, గ్రామ పెద్దగారియిల్లు దూరంగా అవతలవైపు ఉందిగదా మంట అక్క-డికి పాకలేదుగదా అని చెప్పి ఆయన్ని అక్కడికి తీసుగు వెళ్ళారు.

ఇవాన్ తన తండ్రిదగ్గిరికి వచ్చినప్పుడు, ఇంట్లో గ్రామపెద్ద గారి భార్యమాత్రమే ఉంది. కొందరు పసిపిల్లలు మట్టుకు వేడి మిద్దెమీద ఉన్నారు. తక్కినవాళ్ళంతా ఇళ్ళు కాలినచోటే ఉన్నారు. ముసిలాయన ఒక బెంచిమీద పడుకున్నాడు. వెలిగించిన వత్తి చేత్తో పట్టుగుని తలుపుకేసి చూస్తూ ఉన్నాడు. తన కొడుకు ఇంట్లో ప్రవేశించగానే, అతడు కొంచెం కదిలాడు. ముసిలావిడ బెంచిదగ్గిరికి వెళ్ళి ఇవాన్ వచ్చిన సంగతి ముసిలాయనతో చెప్పింది. అతణ్ణి ఇంకా దగ్గిరికి రప్పించమని ఆయన కోరాడు. ఇవాన్ ఆయన పక్కకి వెళ్ళాడు. ముసిలాయన ప్రారంభిస్తూ, 'నీతో నేను ఏమని చెప్పాను, ఇవాన్? గ్రామం తగలబెట్టినవా రెవరూ?' అన్నాడు. ఇవాను, 'వాడే, నాయనా! ఆ పనిలో వాడు ఉంటూండగా నేను పట్టేశాను. వాడు మండే కొరివి తీసిగెళ్ళి చూరులో పెట్టడం చూశాను. మొట్టమొదట ఆ అంటుగుంటూన్న పరకలు కాసినీ నేను కిందికి లాగేసి కాల్తో రాసి పారేసి ఉంటే, మరేమీ జరక్కుండా ఉండేది.' అన్నాడు. ముసిలాయన, 'ఇవాన్, నేను మరణిస్తున్నాను, కాలం ఆసన్నం కాగానే నువ్వూ మరణించగలవు. చెప్పు. పాపం ఎవరిది?' అని అడిగాడు. ఇవాన్ మౌనంగానే తన తండ్రికేసి నిదానంగా చూస్తూ ఉండిపోయాడేగాని ఒక్కమాట అడలేక పోయాడు. 'చెప్పు. దేవుడి సమక్షం అనుకో, పాపం ఎవరిది? నేను నీతో ఏమని చెప్పాను?' అని ముసిలాయన అన్నాడు. అప్పటికి ఇవాన్‌కి జ్ఞానోదయం కాగా, అతడు అంతా అర్థం చేసుగున్నాడు. అతడు ఎంతో బాధపడుతూ, 'పాపం నాదే,

నాయనా,' అన్నాడు. తను మోకరిస్తూ తండ్రి పాదాలమీదవాలి, 'నన్ను క్షమించు, నాయనా! నేరం నాదని నీయెదట ఒప్పుగుంటున్నాను, దేవుడి యెదటకూడా ఒప్పుగుంటాను' అన్నాడు. ముసిలాయన తన చేతులు కదిపి కొవ్వొత్తి ఎడమచేత్తో పుచ్చుగుని కుడిచేత్తో తన నుదుటిమీద శిలువ ఆకారం అభినయించుగోడానికి యత్నించాడు గాని శక్తిలేక ఆగిపోయాడు. 'ప్రభువుని స్తుతించు, ప్రభువుని స్తుతించు' అంటూ అతడు తన దృష్టి మళ్ళీ తన కొడుకుమీద ప్రసరిస్తూ, 'ఇవాన్, ఇవాన్,' అన్నాడు. 'ఏమిటి నాయనా?' అని కొడుకు అడిగాడు. 'ఇప్పుడు నువ్వు చెయ్యవలిసింది ఏమిటి?' అని ఆయన ప్రశ్నించాడు. ఇవాన్ గొల్లుమని ఏడుస్తూ, 'ఇప్పుడు మరి బతగడం ఎట్లాగో తెలియడంలేదు, నాయనా,' అన్నాడు. ముసిలాయన కళ్ళుమూసుగుని, బలం చేకూర్చుగోడానికో అన్నట్టు పెదవులు కదిపి చూసుగుని మళ్ళీ కళ్ళుతెరిచి, 'నువ్వు నిర్వహిస్తావు. దేవుడి అజ్ఞ నువ్వు అనువర్తిస్తే, తప్పకుండా నిర్వహిస్తావు!' అని ఒక లిప్త ఆగి, చిరునవ్వు నవ్వి, 'జాగర్త ఇవాన్! నిప్పు ఎవరు ముట్టించారో ఎవరితోనూ చెప్పకు. ఎవడేనా చేసిన పాపం ఒకటి నువ్వు దాస్తే, నువ్వుచేసిన రెండు పాపాలకి దేవుడు నిన్ను క్షమిస్తాడు,' అని, కొవ్వొత్తి రెండు చేతులా పట్టుగుని, చేతులు వక్షంమీద జోడించుగుని, నిట్టూర్పు పుచ్చి, పట్టు సడలగా, మరణించాడు.

గేబ్రియల్ చేసిన ఘోరం ఇవాను ఎవడితోనూ ఏమీ చెప్పలేదు, నిప్పు ఎవరు ముట్టించారో ఎవడికీ తెలియలేదు. గేబ్రియల్

మీద ఇవాన్ కోపంతగ్గి పూర్తిగాపోయింది. ఇవాన్ ఆ ఘోరం ఎవడితోనూ చెప్పకుండా ఊరుకోడం గేబ్రియల్‌కి ఆశ్చర్యం కలిగించింది. మొదట గేబ్రియల్ భయపడ్డాడుగాని కాల క్రమాన్ని అలవాటుపడి సర్దుకున్నాడు. వాళ్ళు కలహం వదులు కున్నారు, వాళ్ళ కుటుంబాలూ కలహం వదులుకున్నాయి. తమ కొత్తయిళ్ళు తయారయే వ్యవధికాలంలో వాళ్ళిద్దరూ తాత్కాలి కంగా ఒకేయింట్లో ఉన్నారు. పైగా కొత్తగ్రామంలో ఎవరు ఎవరికెంత దూరంగా ఉండడానికైనా వీలున్నా, ఇద్దరూ మళ్ళీ ఒకరిపక్క ఒకరు వెనకటిలాగే ఉండేటట్టు ఇళ్ళు కట్టుగున్నారు, ఇరుగుపొరుగులు జీవించవలిసిన రీతిగానే జీవించారు. తన ముసిలితండ్రి ఆజ్ఞ ఇవాన్ జ్ఞప్తిలో ఉంచుగున్నాడు: దేవుని ఇచ్ఛ అనుసరించాలనీ, మొదటి నిప్పురవ్వనే ఆర్పాలనీ, ఎవడేనా హానిచేస్తే కసితీర్చుగునేకంటె ఇతరత్రా వ్యాపారం సరిచెయ్యా లనీ, ఎవడేనా తన్ని ఒక చెడుమాట అనగానే వాణ్ణి అంతకంటె చెడుమాట అనేసేకంటె దుష్టమాటలు వాడు వాడకుండా ఉండే టట్టు—తద్వారా తన స్త్రీలూ పిల్లలూ కుడా వాడకుండా ఉండే టట్టు, వాడికి బోధించాలనీనీ: ఇవన్నీ అతడు ఆచరించాడు. ఇవాన్ తన సంసారం మళ్ళీ నిలదొక్కుగోగలిగి, వెన కెప్పు డేనా జీవించినకంటె సుఖతరంగా ఇప్పుడు జీవిస్తున్నాడు.

## భమిడిపాటి కామేశ్వరరావుగారు

జననం ఏప్రిల్ 1897. పాఠశాలా విద్య-ఏలూరు, నర్సాపురం. కాలేజీ చదువు-కాకినాడ, రాజమహేంద్రవరం. 1918 లో బి. యే. (గణితశాస్త్రం). 1922 లో యల్. టి. నాటినించి వీరేశలింగం హైస్కూలులో గణితాధ్యాపకులు. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగ. జూన్ 1953 లో ఉద్యోగ విరమణము. పద్యపఠనంమీదా అభినయంమీదా ఆసక్తి కలవారు.

జీవితంలోని వాక్చమత్కృతుల సేకరణ మొదటి కృషి. 'భారతి' కి 1926 నించి సంబంధి. చమత్కార సంభాషణలూ, 'త్యాగరాజ ఆత్మవిచారం' అనే త్యాగరాజ రచనల సారమూ ప్రకటించారు. భాగయ్య, పర్వతాలు, శఠకోపం, శానయ్య, మాలోకం మొదలైన పాత్రల పరిచయం సర్కార్లలోనూ రాయలసీమలోనూ నైజాం ప్రాంతాలలోనూ కలిగించారు. ఇటీవలి నాటకాలూ కథలూ ప్రశంసలూ అచ్చు కానున్నవి.

